# విల్లు వ్రాయుట

# (WILL)


రచయితలు

వడ్లమాని వెంకట రమణ, B.A.,B.L.

వడ్లమాని వెంకట నాగేశ శర్మ, B.Com. ML

Advocates

కాకినాడ





శ్యామలా పబ్లికేషన్సు

23-7-23, T.T.D. మండపం వీధి

కాకినాడ - 533 001

ఫోను : 0884 -375208

1998

# విల్లు వ్రాయుట
# (WILL)


రచయితలు

వడ్లమాని వెంకట రమణ, B.A.,B.L.

వడ్లమాని వెంకట నాగేశ శర్మ, B.Com. ML

Advocates

కాకినాడ





శ్యామలా పబ్లికేషన్సు

23-7-23, T.T.D. మండపం వీధి

కాకినాడ - 533 001

ఫోను : 0884 -375208

1998

# వీలునామా వ్రాయుట

## విషయసూచిక

## 1వ అనుబంధం

### వీలునామాల నమూనాలు



## 2వ అనుబంధం



## 3వ అనుబంధం

# తొలి పలుకులు

వీలునామా (Will) అనే పదం సంస్కృతంలో గాని తెలుగు భాషలోగాని ఏ శాస్త్రగ్రంథంలోనూ వాడబడలేదు, కాని "మరణ శాసనం" అనే మాట అక్కడక్కడ వాడుకలో ఉన్నట్లు Sir Thomas Strange పండితుడు అభిప్రాయపడినాడు. హిందు శాస్త్రవేత్తలకు ఆస్తి బదలాయింపులలో ఏడు రకముల దస్తావేజులు బాగుగా తెలియును. అవేవనగా పంపకం (Partition) దానము, కొనుగోలు చేయుట, తనఖా, ఎగ్రిమెంటు సర్వీసుపత్రం (Bondage) ఋణపత్రం మాత్రమే.

అంతకుముందు "లా" ఎటులున్నను "Will" అనే పదం, డాక్యుమెంటు, మనకు మొదటిసారిగా ఇంగ్లీషుభాషలో William Shakespeare వ్రాసిన ప్రసిద్ధమైన నాటకం "Julius Ceaser" ద్వారా వినవచ్చింది. ఆ నాటకంలో Ceaser ని Brutus మొదలగువారు హత్య చేస్తారు. అప్పుడు Ceaser అనుయాయి Anotony ప్రజలకు Ceaser వీలునామా (Will) ద్వారా తన సర్వస్వం దఖలు పరచినట్లు చెప్పి ఆ Will పై ఉత్కంఠకలిగిస్తాడు. ప్రజలందరు Ceaser's Will ను బయటపెట్టమంటారు. అదిగో అప్పటినుండి Will అనే పదం - డాక్యుమెంట్ రోమన్స్ నుండి బ్రిటీష్‌వారికి సంక్రమించి వారి ద్వారా మనకు import కాబడి - కాలక్రమేణా అక్కడక్కడ శాసనములు కూడా చేయబడి అల్టిమేట్‌గా "The Indian Succession Act, Act No. 39 of 1925 లో చోటు చేసుకుని అమలులోనికి వచ్చి ఇప్పటికిని అమలు జరుగుచున్నది. ~~ఈ~~ Indian Succession Act ఇండియన్, క్రిస్టియన్‌లకు, పారసీలకు, హిందువులకు కూడా అందు వివరముగా చెప్పబడిన సెక్షన్లు అమలు జరుగుతున్నాయి. ~~ఈ~~ శాసనంలోని Section 2(h) లో "Will" అనే పదానికి నిర్వచనం ~~ఈ~~యబడింది. అయితే వీలునామా ద్వారా ఎవరైనా ఒక వ్యక్తి తన ఆస్తిని తన మరణానంతరం అమలు జరిగేటట్లు బదిలీ చేయవచ్చును.

Hindu Succession ~~Act 1956~~ అమలులోనికి వచ్చేపర్యంతం మితాక్షర - దాయ భాగ Systems ఇతర గ్రంథాలపైన హిందూ perfect గా అవధారపడిఉండేది. హిందువులంటే ఎవరో హిందు వారసత్వ చట్టం 4వ సెక్షన్‌లోను, unగుగా చెప్పబడినది. వీలునామా వ్రాయకుండ మరణించిన వ్యక్తి (Intestate గా చనిపోతే) వాని ఆస్తికి వారసులను హిందువారసత్వ చట్టం ప్రకారం నిర్ణయించాలి.

# వీలునామా వ్రాయడం వలన కలిగే ప్రయోజనాలు

ఏ కాలములోనైనా వ్యక్తియొక్క అస్తిత్వము, ఉనికి లేదా మనుగడ నిర్ణయించి చెప్పలేము. ఏ వ్యక్తి అయినా తనకష్టార్జితం, పిత్రార్జితం సంపద తన తదనంతరం తాను పెంచి ప్రేమించిన సంతతికి ప్రియురాలైన భార్యకు లేదా ఇతర బంధువులకు సేవకులకు చెందాలని, చెందజెయ్యాలని ఆరాటపడుతూ ఉంటాడు. సాధారణంగా ఈ విషయం పైకి అనేక కారణాలవల్ల చెప్పరు. కాని ఎట్టి ఏర్పాట్లు చేయకుండనే అనేకమంది మరణించడం మనం గమనిస్తున్నాం.

నాగరికత ప్రబలి, సైన్సు ఎంతగానో అభివృద్ధిచెందిన నేటి కాలంలో రైలు, బస్, కారు, స్కూటర్ మొదలగు వాహనాల ప్రమాదం వలననో విమానాలు కూలిపోవడంచేతనో, భూకంపాలు సంభవించడంచేతనో అకాలమరణాలు అనేక రకాలుగా సంభవించడం చూస్తున్నాము. అలాంటి విషమపరిస్థితులలో మరణించినవాని ఆస్తిని గురించి నిల్వల గురించి ఎడ-తెఅపిలేని లిటిగేషన్‌తో సతమతం అవడం మనం గమనిస్తూనే ఉన్నాము. వీటి బారినుండి తప్పించుకోడానికి ఒకే ఒక మార్గం Will వ్రాయడమే. అయితే Will వ్రాసినంతమాత్రాన ఆ వ్యక్తి మరణిస్తాడనే నిశ్చయానికి జంప్ చేయడం సబబు కాదు. Will వ్రాసినంతమాత్రాన, లైఫ్-ఇన్సూరెన్సు చేసినంత మాత్రాన ఎవరూ మరణించరు. Will వ్రాయనివారు లైఫ్-ఇన్సూరెన్సు చేయనివారు చిరంజీవులుగా ఉండనూ ఉండరు.

బ్యాంకు లాకరు కంటే, ఇనుపపెట్టెకంటె కూడా ఆస్తిని అన్ని కోణాలనుంచి కాపేడేది పద్ధతిప్రకారం వ్రాయబడిన Will మాత్రమే అని గుర్తించడం చాలా అవసరం.

వీలునామాను వ్రాసి తన అభీష్టము ఏమిటో తెలియజేయడం మొదటి ప్రయోజనం. తన తదనంతరం తన ఆస్తులు తనకు ఇష్టంలేనివారి చేతులలోనికి పోకుండా అరికట్టడం రెండోది.

ఎన్ని లక్షల రూపాయల విలువగల ఆస్తులకైనా వీలునామాకు స్టాంప్ డ్యూటీ అవసరంలేదని అందరు గుర్తించాలి. రిజిస్ట్రేషను కంపల్సరీకాదు. తన అభిప్రాయం రహస్యంగా ఉంచాలంటే తన వీలునామాను పేకెట్‌లో పెట్టి సీలు చేసి రిజిస్ట్రారువద్ద ఉంచవచ్చును. తన 3వ ...ర్యాయములు మార్చుకొనవచ్చును. రద్దు పరచి కొత్త Will వ్రాయవచ్చు సంబ... వీలునామాకు మార్పులు-చేర్పులు చేయవచ్చును. అదే Codicil. ఇంకా ప్రయోజనాలు ఏమిటంటే తనమైనరు beneficiaries కి వీలునామా ద్వారా గార్డియన్‌ని నియమించవచ్చును. వానినే Testamentary Guardian అంటారు.

ఇంకా వీలునామా ద్వారా ఆస్తి పంపకం కూడా చేయవచ్చును. తన తదనంతరం వీలునామా ద్వారా సంక్రమింపజేయదలచిన ఆస్తులు, రాబట్టుకొనవలసిన బాకీలు మొదలగు మేనేజ్మెంట్కి సంబంధించి తనకు నమ్మకం గల వ్యక్తిని గాని, వ్యక్తులను గాని Executor గా నియమించవచ్చును. అతితక్కువ ఖర్చుతో ఎన్నో ప్రయోజనాలను కల్పించే ఏకైక సాధనం Will వ్రాయడమే.

మెజారిటీ వచ్చిన ఏ హిందు పురుషుడైన మహిళయైన లేదా ఇద్దరు కలిసి అయినా వీలునామా వ్రాయవచ్చును. వ్రాసేవారు (Testator) ఉన్మాదులు - పిచ్చి - వెర్రివారు కాకుండా ఉండాలి. మంచి ఆరోగ్యము, వ్యవహార జ్ఞానం కలిగియున్న ఏ వ్యక్తి అయినా వీలునామా వ్రాయవచ్చును. ఏ భాషలో వ్రాసేరు అన్నది ముఖ్యముకాదు. ఇంగ్లీషులో గాని, తెలుగులోగాని, ఇతర ప్రాంతీయ భాషలలో గాని వీలునామా వ్రాయవచ్చును. తదుపరి ముఖ్యమైన అంశమేమంటే వీలునామా వ్రాసిన వ్యక్తి సంతకం చేయుటయో లేదా వేలిముద్ర వేయుటయో జరిగించుచుండగా చూసిన సాక్షిగాని, సాక్షులుగాని అందుపై సంతకం చేయడం అతిముఖ్యము. లేఖరి చేత వ్రాయించినా, టైపిస్టు చేత టైపుచేయించినా వారి సంతకం కూడా అవసరం. వీలునామాకు రిజిస్టరీ చేయించడం కంపల్సరీ కాకపోయినా రిజిస్టరీ చేయించినందువలన ఆ వీలునామా నిజాయితీని నిరూపించడానికి సబ్ రిజిస్ట్రారు మరియిద్దరు సాక్షులు కూడా లభ్యం అవుతారు. Suspicious circumstances కి తావుండదు. ఆ వీలునామాయే తన చివరి వీలునామా అనియు సదరు వీలునామాను తన జీవితకాలంలో మార్పు చేసికొనుటకు రద్దుచేసికొనుటకు హక్కు తనయందుంచుకున్నట్లు కూడా అందులో వ్రాయడం చాలా అవసరం. ఒక పేజి మించి ఉన్న వీలునామాల విషయంలో అన్ని పేజీలలోను Testator సంతకం చెయ్యడంగాని, వేలిముద్రలెయ్యడంగాని జరిగించడం అవసరం. వీలునామా చివరను Testator సంతకం చేయడంగాని, వేలిముద్రలు వెయ్యడంగాని జరిగించినా అది చెల్లుబాటుఅవుతుంది. కాని To avoid fraud అన్ని పేజీలలో సంతకం చెయ్యడం desirable అని తెలుసుకోవాలి.

వీలునామా వ్రాసిన వ్యక్తి (Testator) వీలునామా వ్రాసిన తరువాత చిరకాలం జీవించి ఉండి కొన్ని ఆస్తులను విక్రయించినా మార్పు చేసినను వీలునామా చెల్లుబాటుకు భంగమురాదు. మిగిలిన Bequests కే పరిమితం అయియుంటుంది.

వీలునామా ద్వారా ఎక్కువ ఆస్తులను సంక్రమింపజేయువారు ఆస్తుల పూర్తి వివరాలు Executor పేర్కొనకపోయినా వీలునామా perfect గా అమలు జరుగుతుంది.

ఇంక వీలునామాలో వాడబడే పదజాలం క్లియర్గాను, unambiguous గాను ఉంటే Testator యొక్క అభిప్రాయం వెంటనే అవగాహన అవుతుంది. ఇన్ని ప్రయోజనాలుగల ఖర్చులేని డాక్యుమెంటు Will అని గుర్తించాలి. సూటిగా సూక్ష్మంగా

చెప్పాలంటే వీలునామాకు కావలసినదల్లా చక్కని వ్యవహార జ్ఞానం (Sound and disposing state of mind) ఆత్మీయులైన ఇద్దరు సాక్షులు - ఒక తెల్లకాగితం మాత్రమే.

చదివిన వెంటనే అర్థం అయేటట్లు ఉండడం నిమిత్తం ఈ పుస్తకం వ్రాయడంలో ఎంతో కృషి చేసాము. వీలునామా వ్రాయడానికి ఎవరి సలహాలు సంప్రదింపులు పొందకనే ఎవరి మట్టుకువారు ఎవరి వీలునామా వారు వ్రాసుకోడానికి లేదా వ్రాయించుకోడానికి ఉపయోగపడే విధంగా వీలునామాల నమూనాలు కూడా అనుబంధముగా చేర్చబడినాయి. యువతరం లాయర్లు, లైసెన్సు పొందిన డాక్యుమెంట్ రైటర్స్‌కు ఒకమంచి అవగాహన కుదిరే నిమిత్తం - విషయం ప్రధానంగా సుప్రీంకోర్టు హైకోర్టుల తీర్పులు కూడా అనుబంధములో చేర్చబడినవి.

Probate, Letters of administration, succession certificates ను గురించి కూడా చర్చించి వ్రాయడమైనది.

ఈ పుస్తకంలో ఇంగ్లీషు పదాలు కూడా ధారాళంగా వాడినాము. Legal Terminology ఆ పదం చదవగనే దాని అర్థం వెంటనే అవగాహన అవ్వాలని వాడడమైనది. వీలునామాకు సంబంధించిన పదజాలములో ఈ క్రిందివి ముఖ్యమైనవి.

Will - వీలునామా

Testator లేదా Testratrix - వీలునామా వ్రాసి, ఆస్తి తన తదనంతరం ఇతరులకు సంక్రమింపజేయు వ్యక్తి.

వీలునామా వ్రాసినవారు అంటే లేఖరి అనుకోరాదు.

లేఖరిని - Scribe అంటారు.

Beneficiary - వీలునామా ద్వారా లబ్ధిపొందు ఆసామీ

Attestor - వీలునామాపై సాక్షిసంతకం చేయు వ్యక్తి.

Bequest - వీలునామా ద్వారా సంక్రమింపజేయు ఆస్తి.

Executor - వీలునామా అమలు జరుపు వ్యక్తి.

A.I.R. - All India Reporter.

A.L.T. - ఆంధ్రా లా టైమ్స్.

ప్రతివ్యక్తికి, కుటుంబానికి ఈ చిన్న పుస్తకం ఎంతో మేలు చేకూరుస్తుందని తమ తమ ఆస్తులకు Will వ్రాయడం ద్వారా రక్షణ కల్పించి నిర్భయంగా వ్యవహరిస్తారని ఆశిస్తున్నాము.

**వి.వి. రమణ**
**వి.వి.యన్. శర్మ**
అడ్వకేట్స్, కాకినాడ.

# మొదటి అధ్యాయం

# వీలునామా వ్రాయుట

## వీలునామా అనగానేమి?

వీలునామా (will) అంటే ఏమిటో మొదటిసారిగా ఇండియన్ వారసత్వ చట్టం నిర్వచనం ఇచ్చింది. (Indian Succession Act సెక్షను 2(h)

వీలునామా వ్రాయు వ్యక్తి తన ఆస్తిని తన తదనంతరం (after his death) ఏవిధముగ దఖలు పరచవలెనో తన అభిప్రాయమును వ్రాతమూలకముగా లా ప్రకారం వెలిబుచ్చుటను వీలునామా (will) అందురు.

Indian Succession Act (ఇండియన్ వారసత్వ చట్టం) లో ఈయబడిన నిర్వచనం ఈ క్రింది విధంగా ఉంది:

సెక్షను 2(h)

"Will" means the legal declaration of the intention of the testator with respect to his property which he desires to be carried into effect after his death".

ఒక వ్యక్తి తన జీవితకాలంలో తన ఆస్తిని గురించి తన తదనంతరం ఏ రీతిగా అమలు జరుగవలెనో వ్రాతమూలకంగా తెలియజేయకుండ మరణించితే అతడు "Intestate" (ఇంటెస్టేట్)గా గతించినట్లు పరిగణించబడును. వీలునామా వ్రాస్తే అవి Testamentary అవుతుంది. లేకుంటే "Intestate"గా మరణించినట్లు లా ప్రకారం భావించబడుతుంది. ఇంటెస్టేటుగా అనగా వీలునామా మొదలగు లిఖితములు వ్రాయకుండా ఏ వ్యక్తి అయినా మరణిస్తే అతడు హిందువా? ముస్లిమా? లేక క్రిస్టియన్ మతానికి చెందినవాడో అయితే ఆయా మతాలకు సంబంధించిన వారసత్వ చట్టాల ప్రకారం మరణించిన వాని ఆస్తి ఆయా వారసులకు దఖలు పడుతుంది.

1956 సంవత్సరంలో హిందు వారసత్వ చట్టం అమలులోకి వచ్చింది. ఇంటెస్టేట్‌గా మరణించిన వాని ఆస్తికి వారసులెవరో ఆ చట్టంలోని షెడ్యూల్సులో వివరంగా చెప్పబడినది. హిందూ వారసత్వ చట్టం అమలులోనికి రాక పూర్వం "మితాక్షర" - "దాయభాగ" స్మృతులు వాటిపై వ్యాఖ్యలు, వాటిపై ప్రీవీ కౌన్సిలు వారు, వేరు వేరు హైకోర్టులు ఇచ్చిన తీర్పులు ఆధారంగా ఉండేవి.

ముస్లింలకు ఇస్లాం లా ప్రకారం వారసత్వం నిర్ణయింపబడుతోంది.

ఇండియన్ క్రిస్టియన్లకు ఇండియన్ వారసత్వ చట్టం అమలు పరచబడు తోంది.

ఇండియన్ యూనియన్‌లో నివసించే భిన్న భిన్న మతస్థులందరికి వారసత్వం ఒకే విధంగా అమలు జరుగుటకు వీలుగా uniform civil code అమలు చేయాలని ఇండియన్ కాన్‌స్టిట్యూషన్‌లో పేర్కొనబడినది. (ఆర్టికిల్ 44 ఆదేశించింది.)

ఇంతవరకు అప్రయత్నం జరగలేదు.

ఈమధ్యనే సుప్రీంకోర్టు కేంద్ర ప్రభుత్వాన్ని uniform సివిల్‌కోడ్ ప్రవేశపెట్టమని ఆదేశించింది. కల్యాణి సంస్థ అధ్యక్షురాలు సరళా ముద్గల్ దాఖలు చేసిన పిటీషనుపై సుప్రీంకోర్టు మే 95లో పైవిధముగ direction ఇచ్చింది.

ఒక ఆసామీ తన ఆస్తి తన తదనంతరం ఎవరికి దఖలు పరచాలో, ఎవరెవరికి ఎంతెంత ముట్ట చెప్పాలో తన జీవితకాలంలోనే నిర్ణయించడం హర్షదాయకం కదా. వీలునామా వ్రాయడం మిగతా లిఖితములకంటె చాలా సులువు. తక్కువ ఖర్చుతో వ్రాయవచ్చు. ఒకవేళ ఆ ప్రకారం అమలు జరపడం ఇష్టంలేకపోతే ఆ వీలునామాను రద్దుపరచి మరియొకటి వ్రాయవచ్చు. లేదా మార్పు చేయవచ్చు. (codicil) మరియొక పత్రాన్ని దానికి జతచేయవచ్చు. ఎన్ని లక్షల రూపాయల విలువగల ఆస్తులకైన స్టాంపుపై వ్రాయనవసరంలేదు. వీలునామాకు రిజిస్ట్రేషను తప్పనిసరి కాదు (compulsory). రిజిష్టరీ చేయించితే దానికి మరికొంత బలం పెరుగుతుంది. వీలునామాకు కావలసినదల్లా మంచి తెల్లకాగితం ఇద్దరు సాక్షులు మాత్రమే.

కాల పరిస్థితులలో ఎన్నో మార్పులు వచ్చినవి. సైన్సు అభివృద్ధి చెందింది. టెక్నాలజీ పరుగిడుతోంది. తెల్లవారిలేచి పేపరు తెరిచే సరికో రేడియో ట్యూన్ చేసేసరికో, లేదా టి.వి ఆన్ చేసేటప్పటికో రోడ్డు ప్రమాదాలు, రైలు, విమాన ప్రమాదాలు, భూకంపాలు ఇలాటివి ఎన్నెన్నో కనిపిస్తూనే ఉన్నాయి. వీధిలోకి వెళ్ళిన ఆసామీ తిరిగి ఇంట్లో కాలుపెట్టేదాకా life కి గ్యారంటి లేదు. ఇటువంటి పరిస్థితుల్లో ఏ వ్యక్తి అయినా తన తదనంతరం తన ఆస్తి ఏవిధంగా ఎవరెవరికి చెందాలో ముందుగా వీలునామా రీత్యా వ్రాసి పెట్టినంత మాత్రాన తప్పులేదు. వీలునామా వ్రాసిన కారణంచేతనే ఎవరూ మరణించరు. అకాలంలో అకస్మాత్తుగా ఏ వ్యక్తి అయినా చనిపోవడం తటస్థించితే వాని ఆస్తిని గురించి వాని బంధువులు, వారసులు కోర్టు చుట్టు ప్రదక్షిణాలు చెయ్యనక్కర్లేకుండ వీలునామాలో వ్రాసిన ప్రకారం సదరాస్తిని అనుభవించవచ్చును. వీలునామా వ్రాసినందువలన రాగల కాలంలో ఎదురయ్యే ఇబ్బందులను సులువుగ అధిగమించవచ్చును. ఆస్తి ఎక్కువగా ఉన్న వారే వ్రాయాలనుకోవడం పొరబాటు. ఎంత ఆస్తి ఉంటే అంతకే వ్రాయవచ్చును. వీలునామా వ్రాసిన తదనంతరం తాను సంపాదించబోయే ఆస్తిని కూడా వీలునామా ద్వారా తన ఇచ్చవచ్చిన వారికి చెందజేయువచ్చును. ఏ కారణంచేతనైనా మార్చుకోవాలన్నా అప్పటికి ఉన్న విల్లును రద్దుచేసి మరియొక వీలూనామా వ్రాయవచ్చును. అతి తక్కువ ఖర్చుతో ఒక ఆసామీ తన తదనంతరం తన ఆస్తికి జరుగవలసిన ఏర్పాట్లను లా ప్రకారం జరిగించుటకు వీలునామా వ్రాయుట సులువైన మార్గము. నిజంగా ఇది వరం అనే చెప్పవచ్చు.

ఒక ఆసామీ వీలునామా వ్రాసి అందులో తన కుటుంబ చరిత్ర కూడా వ్రాస్తే తాను వీలునామా ద్వారా వారసులకు కాక ఇతరులకు ఆస్తి ఎందుకు సంక్రమింపజేయవలసి వచ్చిందో స్పష్టంగా తెలుస్తుంది.

# 2వ అధ్యాయం

## వీలునామా వ్రాసేవారి వయోపరిమితి శారీరక మానసిక పరిస్థితులు:

1875 సంవత్సరంలో వచ్చిన ఇండియన్ మెజారిటి Act ప్రకారం 18 సంవత్సరములు వయసు నిండిన ప్రతి వ్యక్తియు మేజరుగా పరిగణింపబడుదురు. ఏ వ్యక్తికిగాని వాని ఆస్తికిగాని కోర్టుద్వారా గార్డియన్‌ను నియమింపబడినచో ఆ వ్యక్తి యొక్క మైనారిటీని ఆ వ్యక్తికి 21 సంవత్సరముల వయసు నిండేవరకు పొడిగింపబడును.

## వీలువ్రాసేందుకు అర్హతలు

మేజరు అయిన ప్రతి వ్యక్తియు వీలునామా వ్రాయుటకు అర్హత కలదు.

వీలునామా వ్రాయుట వలన వారేమి చేయుచున్నారో తెలుసుకోగల శక్తి ఉంటే చెవిటి మూగ, గ్రుడ్డి వారు కూడ వీలునామా వ్రాయవచ్చును. ఎవరైనా ఒక వ్యక్తి సాధారణముగ మానసిక వ్యాధికి గురియై యుండినను (Insane) ఆ వ్యాధిలేని మామూలు సమయాలలో Lucid Intervals లో ఆ వ్యక్తి వీలునామా వ్రాయవచ్చును. చెవిటి, మూగ, గ్రుడ్డివారు కూడా వారు ఏమి వ్రాయుచున్నారో తెలుసుకోగల్గితే వారు కూడా వీలునామా వ్రాయవచ్చు.

మత్తు పదార్థము సేవించుటవలన గాని, రోగగ్రస్తుడై యుండిగాని తానేమి చేయుచున్నది తెలుసుకోలేని స్థితిలో ఉన్న వ్యక్తి వీలునామా వ్రాయరాదు.

(ఇందుకు సంబంధించిన వివరాలు Indian Succession Act Section 59 లో చెప్పబడినవి).

వీలునామా ద్వారా తండ్రి తన శిశువులకు మైనర్లకు గార్డియన్‌ను నియమించు అధికారము కలదు. ఆవిధంగా నియమింపబడిన సంరక్షకుని టెస్టిమెంటరీ గార్డియన్ అని అంటారు.

# విల్‌ని రద్దు చేయవచ్చును

ఎవరు వ్రాసిన విల్లును వారు మార్పుచేసికొనవచ్చును. రద్దు పరచవచ్చును. తాను వ్రాసిన విల్లును చింపివేయుటద్వారా గాని, కాల్చివేయుట ద్వారా గాని లేదా మరియొక వీలునామా వ్రాయుటద్వారా గాని తాను వ్రాసిన విల్లును రద్దు పరచవచ్చును. వీలును రద్దు పరచుటకు ఏదీ క్రమపద్ధతి లేదు.

పైన వ్రాయబడినవి అన్నియు విశేషాధికారాలు లేని సామాన్య పౌరులందరు గమనించవలసిన విషయములు. ఇవియన్నియు unprivileged will కు సంబంధించినవి.

# 3వ అధ్యాయం

## వీలునామా ముఖ్య లక్షణములు

వీలునామా వ్రాసినతడు ఏ చోటున ఏ జిల్లాలో వ్రాయుచున్నాడో, ఏ తేదీన వ్రాయుచుండెనో తన తండ్రిపేరు తన పేరు, తన వయస్సు, ఉద్యోగం లేదా వృత్తి మొదలగు వివరాలు ముందుగా వ్రాయాలి.

తన కుటుంబ పరిస్థితి కూడా వ్రాయడం మంచిది. మంచి తెలివితోను, వ్యవహార జ్ఞానంతోను వీలునామా అంశములు వ్రాయించినట్లు లేదా వ్రాసినట్లు పేర్కొనడం కూడా అవసరం. తన భార్య లేదా తన భర్త, సంతానము వారిని గురించి కూడా విల్లులో వ్రాసినందువలన ఉపయోగం ఉంటుంది. విల్లు వ్రాసిన వ్యక్తి ఆ వీలునామా ప్రతి పేజీలోను చివరను సంతకం చేయవలెను. సంతకం చెయ్యడం తెలియనివారు అన్ని పేజీలలో ఎడమచేతి బొటనవ్రేలి వేలిముద్ర వేయవలెను. అన్ని పేజీలలో సంతకం చెయ్యాలని నియమంలేదు. చివరను చేస్తే చాలు. కాని fraud జరగకుండా ఉండేందుకు అన్ని పేజీలలో సంతకం చెయ్యడం మంచిది. తన ఆస్తుల వివరం ఆయా ఆస్తులు ఎవరెవరికి తన అనంతరం సంక్రమించ వలసి యున్నదో స్పష్టంగా వ్రాయడం మంచిది. ఎక్కువ ఆస్తులు వీలునామా ద్వారా సంక్రమింపజేస్తే వాటి వివరాలను చూపించే షెడ్యూలు చేర్చడం వలన మేలు కలుగుతుంది.

# 4వ అధ్యాయం

## విల్లుద్వారా జీవితకాల హక్కు యివ్వవచ్చును

వీలునామా ద్వారా చెందజేయు ఆస్తులలో ఏ వ్యక్తికైనా జీవితకాలపు హక్కున్ను (Life interest) మరియొకరికి తదనంతరపు హక్కు కలుగజేస్తే ఆయా వ్యక్తుల వివరాలు స్పష్టంగా వ్రాయాలి.

## సాక్షులచే విల్‌పై సంతకాలు

ప్రతి వీలునామాకు ఇద్దరు సాక్షులు కనీసం ఉండాలి. (Indian succession Act, Section 63 (c) ఎక్కువ మందిచేత కూడా సాక్షి సంతకాలు చేయించవచ్చును. తన విల్లుకు సాక్షులను ఎంపిక చేసుకోవడంలో కొన్ని మెలకువలు కలవు. విల్లులో సాక్షిసంతకములు చేయువారు ఇద్దరూ వీలునామా వ్రాయు ఆసామీ వీలునామాపై సంతకం చేయుట చూచినవారై యుండాలి. లేదా వీలునామా వ్రాసినతడు ఇందుపై సంతకం కాని వేలిముద్రకాని తనదేనని చెప్పి సాక్షిచేత సంతకం చేయించుకుని అయినా ఉండాలి. అయితే Testator Will పై సంతకం చేయడం ఒకే సమయంలో ఇద్దరు సాక్షులు చూడనవసరం లేదు. అయితే Will పై సాక్షులందరు ఏకకాలంలో సాక్షి సంతకములు చేయనక్కర్లేదు. ఇంకా -Testator తరఫున అతడు లేదా ఆమె direction మేరకు ఇతర వ్యక్తి ఆ వీలునామాపై సంతకం చేయుట చూచిన సాక్షులు అందుపై సాక్షి వ్రాళ్ళు చెయ్యాలి.

వీలునామా ద్వారా లబ్ధిపొందనివారిచే సాక్షి సంతకములు చేయించుట చాలా శ్రేయస్కరం. లబ్ధిపొందినవారు సాక్షి సంతకం చేయుటకు అర్హులు కాకపోలేదు. వీలునామా చెల్లుబాటు అవుతుంది. అయితే ఆ వీలునామా ప్రకారం ఆ సాక్షికిగాని , వాని భార్యయో భర్తకోగాని ఈయబడిన లబ్ధి (bequest) మాత్రం చెల్లదు. Indian succession Act సెక్షను 67 చూచునది.

## సాక్షి సంతకం చేసేవారు చిన్న వయసు కలవారుగా ఉండుట మంచిది

వీలునామాలో సాక్షి సంతకములు చేయువారు విల్లు వ్రాసిన ఆసామీ కంటె సహజముగ వయసులో చిన్నవారై యుండుట మేలు. వీలునామా అది వ్రాసిన వాని మరణానంతరం అమలులోనికి వస్తుంది. అది అమలులోనికి వచ్చేనాటికి అందుపై సంతకాలు చేసిన సాక్షులు మరణించి యుంటే ఆ విల్లును ఋజువు పరచడంలో శ్రమ కలుగుతుంది. ఆ సాక్షి సంతకాలు చేసిన ఆసామీల సంతకాలు ఎరిగియున్న వారిని తీసికొని వచ్చి ఋజువు చేయవలసి ఉంటుంది. అందుచేత వీలునామా వ్రాసిన ఆసామీ కంటె సాక్షి సంతకములు చేసిన ఆసామీలు వయసులో చిన్నవారై యుంటే సహజముగ వీలునామా వ్రాసిన ఆసామీ మరణానంతరం వారు జీవించి యుందురు. ఆ వీలునామాను సులువుగ ఋజువు చేయవచ్చు. వీలునామాపై సాక్షి సంతకములు చేయు ఆసామీలు మెజారిటీ వచ్చిన వారై యుండాలి. వీలునామా వ్రాసిన ఆసామీతో బంధుత్వములేనివారైతే ఇంకను మంచిది. బంధువులు సాక్షి సంతకం చెయ్యడానికి అర్హతలేకపోలేదు.

ఒకవేళ వీలునామా వ్రాసిన ఆసామీ జీవితకాలంలోనే తన విల్లుపై సంతకములు చేసిన ఇద్దరు సాక్షులు మరణించితే అతడు మరియొక వీలునామా వ్రాయడం చాలా మంచిది.

## సంతకంతో పాటు సాక్షుల వివరాలు (తండ్రి పేరు, నివసించే స్థలం)

సాక్షి సంతకములు చేసిన వారు తమ సంతకముతోబాటు ఆ ఆసామీ తండ్రి పేరు, ఎడ్రస్సు వ్రాయడం మంచిది. వీలునామా ఋజువుపరిచే సమయంలో అది సహాయపడుతుంది.

## సాక్షుల సంతకాలు చేయువిధానం

వీలునామా వ్రాసిన ఆసామీ ఆ విల్లు పై సంతకములు చేసిన తరువాతనే ఇద్దరు సాక్షులు సాక్షి సంతకములు చేయుట అవసరం.

వీలునామాలో వ్రాసిన అంశములన్నియు సాక్షులకు తెలియపరచవలసిన అగత్యం లేదు.

వీలునామాను పెన్నుతోగాని, Ball pen తో గాని వ్రాయవచ్చును. ఇంగ్లీషులో వ్రాస్తే నీటుగా టైపు చేయించడం మంచిది. తుడుపులు, హంసపాదులు వస్తే ఆయా చోట్ల వీలునామా వ్రాసిన ఆసామీ పొడి అక్షరాలతో సంతకం చెయ్యడం మంచిది. లేదా ఆ పేజీ తీసివేసి దాని స్థానే కొత్త పేజి వ్రాయడం మంచిది.

వీలునామాను మరియొక లేఖరిచేత వ్రాయించితే వీలునామా వ్రాసినతడు (Testator) సాక్షులు సంతకాలు చేసిన తరువాత లేఖరి తన దస్తూరి వ్రాసి సంతకం చేసి లైసెన్సు నెంబరు కూడా వెయ్యాలి.

పైన చెప్పబడిన ప్రకారం వీలునామాను వ్రాసి లేదా లేఖరిచేత వ్రాయించి వీలునామా వ్రాసిన ఆసామీ సంతకమో వేలిముద్రయో వేసి ఇద్దరు అంతకుమించిన సాక్షులచేత సాక్షి సంతకాలు చేయించి; లేఖరిచేత వ్రాయిస్తే వాని సంతకం కూడా చేయించితే అప్పటికి వీలునామా వ్రాయడం పూర్తి అయినట్లే :

# 5వ అధ్యాయం

## వీలునామా రిజస్ట్రేషను అవసరమా?

విల్లును రిజిస్టరీ చేయించడం మంచిదని తెలుసుకున్నాం. వీలునామా ఏ సబ్ రిజస్ట్రార్ ఆఫీసులో అయినా రిజిస్టరీ చేయించవచ్చును. స్థిరాస్తికి సంబంధించిన క్రియ దస్తావేజులు మొదలగునవి అన్ని ఆయా ఆస్తులు ఏ సబ్ రిజస్ట్రారు ఆఫీసు పరిధిలో (jurisdiction) ఉన్నవో ఆ సబ్ రిజస్ట్రారు ఆఫీసులోనే రిజస్టరీ చేయించవలసి యున్నది. వీలునామాకు ఆ నియమం లేదు. వీలునామా వ్రాసే ఆసామీ తాత్కాలికంగానో, పర్మనెంటుగానో ఏ సబురిజస్ట్రారు జూరిస్‌డిక్షనులో నివసిస్తూ ఉంటే ఆ సబ్ రిజస్ట్రారు ఆఫీసులో will ను రిజస్టరీ చేయించవచ్చును. విల్లును రిజస్టరీ చేయించునపుడు ఇద్దరు ఎరుక సాక్షులను తీసికొని వెళ్ళుట (Identifying witnesses) మంచిది. సబు రిజస్ట్రారు కార్యాలయం వద్ద లభ్యం అయే సాక్షులయితే వారి address లు దొరకక ఆ ఆసామీలు తెలియబడక విల్లు ఋజువు పరచు సందర్భంలో ఇబ్బందులు కలుగవచ్చును. వీలునామా రిజస్టరీ చేయించుటకు సబు రిజస్ట్రారు ఆఫీసుకు వెళ్ళలేని ఆసామీల ఇళ్ళకుగాని, ఆ ఆసామీ ఆస్పత్రిలో ఉంటే ఆస్పత్రికిగాని రమ్మని లిఖిత పూర్వకంగా కోరితే సబు రిజస్ట్రారు నిర్ణీత రుసుం తీసుకుని వచ్చి వీలునామా రిజస్టరీ చేయును. జైలులో ఉన్న ఆసామీకి అంతే.

# 6వ అధ్యాయం

## వీలునామాను ఎలా భద్రపరచాలి?

రిజిస్టరీ అయినా కాకపోయినా వీలునామాను తద్వారా లబ్ది పొందు ఆసామీకి ఇచ్చివేయడం ఒక పద్ధతి. ఇప్పుడు Banks అన్నిటిలోను safe deposit lockers ఉంటున్నాయి. తనతోబాటు మరియొకరు locker కూడా operate చేయుటకు అధికారం ఇచ్చి అట్టి bank locker లో విల్లు deposit చెయ్యడం మరియొక మార్గం. తనకు నమ్మకం ఉన్న ప్లీడరు వద్ద విల్లు ఉంచడం కూడా సబబు గానే ఉంటుంది.

Testator తన విల్‌ను ఒక కవర్‌లో ఉంచి సీల్స్ వేసి ఆ కవర్ పై తన పేరు, కవర్‌లో ఉన్నది తన విల్ అని వ్రాసి తన ఏజెంట్ పేరు వ్రాసి, తాను గాని, లేదా అతని ఏజెంట్ సబ్‌రిజిస్ట్రార్ వద్ద Deposit చేస్తే సబ్ రిజిస్ట్రార్ దానిని Fire proof box లో భద్ర పరచును. Testator విల్ జీవిత కాలంలో తీసుకొనవచ్చును. లేదా అతను మరణించినట్లు మరణ సర్టిఫికేట్ ఆధారం ఎవరైనా చూపిస్తే విల్ లోని అంశాలను సబ్ రిజిస్ట్రార్ సబ్ రిజిస్ట్రార్ ఆఫీస్‌లోని Book No.3 లో రికార్డు చేయించును.

# 7వ అధ్యాయం

## యుద్ధంలో ఉన్న సైనికులు విల్ వ్రాయుటకు సూత్రాలు

ఇక privileged wills మాటకొస్తే వాటిని వ్రాయుటకు - లేదా oral గా చెప్పుటకు కొందరికి మాత్రమే అర్హత కలదు.

ఎవరైనా సైన్యంలో చేరి యుద్ధ సమయంలో (actual warfare) యుద్ధప్రాతిపదికపై పయనించు (expedition) సైనికుడు (soldier) మరియు అదేవిధముగ నున్న వైమానికుడు (airman) మరియు సాగర మధ్యంలో పయనించు నావికుడు (mariner) వీరు 18 సంవత్సరముల వయస్సు నిండినవారైతే వారి ఆస్తిని విల్లుద్వారా వారి యిష్టంవచ్చినవారికి దఖలు పరచవచ్చును. వీరిలో ఎవరైనా తన విల్లు తాను వ్రాసుకుంటే తాను దానిపై సంతకం చేయకపోయినా, సాక్షి సంతకాలు లేకపోయినా ఆ విల్లు చెల్లుబాటు అవుతుంది. ఆ ప్రకారం వ్రాయలేకపోయినా సావకాశం కుదరకపోయినా తన ఆస్తులు తన తదనంతరం ఏవిధంగా అమలు జరగాలో ఇద్దరు సాక్షుల యెదుట ఆ ఆసామీ చెప్పినట్లయితే అది కూడా చెల్లుబాటు అయే విల్లు అవుతుంది.

అంతేకాక విల్లు అంతాకాని కొంత భాగంకాని మరియొక ఆసామీ చేత వ్రాయించి ఆ ఆసామీ సంతకం చేస్తే చెల్లుబాటు అవుతుంది. దానికి సాక్షులు లేకపోయినా చెల్లుతుంది.

ఏదైనా విల్లును మరియొక ఆసామీ చేత కొంతవరకు గాని పూర్తిగా గాని వ్రాయించి దానిపై అతడు సంతకం చేయకపోయినా సదరు విల్లులోని అంశములు అతడు చెప్పి వ్రాయించినట్లయితే (అతడి direction) అది చెల్లుతుంది. లేదా అట్లు వ్రాయబడినది తన విల్లు అని అతడు ఆమోదించినా (recognise చేయుట) అది చెల్లుబాటు అయే విల్లు అవుతుంది.

ఎవరైనా ఒక సైనికుడో, వైమానికుడో, నావికుడో తన విల్లు తయారు

చేయించుటకు అవసరమగు సమాచారమునంతటిని వ్రాసిపెట్టి విల్లు తయారు అగుటకు ముందుగా మరణిస్తే అతడిచే వ్రాయబడిన సమాచారమునే వాని విల్లుగా భావింపబడును.

ఎవరైనా సైనికుడు గాని, నావికుడు గాని వైమానికుడు గాని యుద్ధ సమయంలో ఇద్దరు సాక్షుల సమక్షంలో తన విల్లు తయారు చెయ్యమని సమాచారమును చెప్పి అది అతడి జీవితకాలములో వ్రాయబడి అతడి సంతకం చేయులోపుగా ఆ ఆసామీ చనిపోయిన యెడల అతడిచే ఇవ్వబడిన సమాచారమే వ్రాతరూపం పొందకపోయినా సంతకం లేకపోయినా అతడి will గా పరిగణించబడుతుంది.

ఎవరైనా సైనికుడు గాని నావికుడు, వైమానికుడైనా యుద్ధ సమయంలో ఇద్దరు సాక్షుల యెదుట వాంగ్మూలముగా చెప్పిన విల్లు అట్లు చెప్పిన తరువాత ఒకనెలవరకు అతడు జీవించి ఉంటే నోటి మూలకంగా చెప్పిన విల్లు చెల్లదు.

ఈ సందర్భమున ఇండియన్ వారసత్వ చట్టంలోని 65, 66వ సెక్షన్స్ చూడండి.

రిటైరు అయిన సైనికోద్యోగులకు యుద్ధ ప్రాతిపదికపై పయనించని ఆసామీలకు పైన వ్రాయబడిన privileges వర్తించవు. వారు unprivileged will వ్రాయవలసినదే.

# 8వ అధ్యాయం

## వీలునామా ద్వారా సంక్రమింపజేయదగు ఆస్తులు

1. **స్థిరాస్తులు** : ఇండియన్ సక్సెషన్ చట్టం (Act 39 of 1925) ప్రకారం ఏ వ్యక్తి అయినా తాను విక్రయించుటకు లేదా అన్యాక్రాంతము చేయుటకు హక్కుగల వీలునామా స్థిరాస్తులన్నిటిని అట్టి వ్యక్తి తన వీలునామా ద్వారా తన యిష్టము వచ్చిన వారికి సంక్రమింపజేయవచ్చును.

అయితే హిందువుల విషయములో ఏ వ్యక్తికైన నిర్దుష్టము అవని జాయింటు కుటుంబ ఆస్తిలో అనిర్దిష్ట వాటా ఉన్న యెడల అట్టి అనిర్దిష్ట వాటా ఆస్తిని కూడా ఆ వ్యక్తి విల్లుద్వారా సంక్రమింపచెయ్యవచ్చునని హిందు వారసత్వ చట్టంలోని 30 వ సెక్షను చెప్పుచున్నది.

అందుచే ఏ వ్యక్తి అయినా తనకు అన్యాక్రాంతముచేయు హక్కుగల ఆస్తిని విల్లుద్వారా ఇతరులకు సంక్రమింపజేయవచ్చును.

ఇళ్ళు, ఇళ్ళ స్థలములు, వ్యవసాయ భూములు, తోటలు మొదలగున వన్నియు విల్లుద్వారా సంక్రమింపజేయవచ్చును.

2. **చరాస్తి** : నగదు బాంకు నిల్వలు, ఫర్నిచరు, పుస్తకములు, పాత్ర సామానులు, షేర్లుపై వచ్చెడి డివిడెండ్లు, బోనస్సు, కారు మొదలగు వాహనములు, కంపెనీలో పెట్టుబడిగా పెట్టిన స్టాక్సు, షేర్లు డిబెంచర్లు, బాండ్లు, సెక్యూరిటీలు, బాంకు డిపోజిట్లు కానటువంటి ఇతర డిపోజిట్లు, వెండి, బంగారు వస్తువులు, ఉమ్మడి వ్యాపారంపై వచ్చెడి లాభములను కూడా విల్లుద్వారా సంక్రమింప జేయవచ్చును.

# 9వ అధ్యాయం

## విల్లుద్వారా ఎంత ఆస్తిని సంక్రమింపజేయవచ్చును?

ఏ వ్యక్తి అయినా తనకు గల యావత్తు చరస్థిరాస్తులను ఏదేని ఒక సంస్థకు గాని, ఏ ఒక్కరికిగాని దఖలు పరచుటకు వీలులేదు.

ఆస్తిని వీలునామా ద్వారా దఖలు పరచెడి వ్యక్తి హిందువు అయినచో అట్టి వ్యక్తి తదనంతరం అతడిపై జీవనోపాధికి ఇదివరలో ఆధారపడిన వ్యక్తులు అతడి ఆస్తిపై అట్టి జీవనోపాధి పొందుటకు హక్కు కలిగియుందురని హిందు దత్తతల మనోవర్తి చట్టం సెక్షను 22 (2) చెప్పుచున్నది. చట్టరీత్యా అట్టి హక్కు కల్పించబడినది.

అయితే "జీవనోపాధి "maintenance" అనగా ఆహారము, నివాసము, దుస్తులు, చదువు, వైద్య సేవలకు న్యాయముగా అవసరమగు ఖర్చులన్నియు జీవనోపాధి క్రిందికే వచ్చును. ఆధారపడి యుండు వ్యక్తి కుమార్తె అయినచో పైన చెప్పిన అవసరములతో బాటు వివాహ ఖర్చులు కూడా ఈ నిర్వచనము క్రిందికే వచ్చును.

ఒక యజమానిపై ఆధారపడిన వ్యక్తులెవరనగా:

హిందు దత్త స్వీకారములమనోవర్తి చట్టం ప్రకారం సెక్షను 21లో చెప్పబడిన వ్యక్తులు

1. అతడు లేక ఆమె యొక్క తండ్రి
2. అతడు లేక ఆమె యొక్క తల్లి
3. తిరిగి పెండ్లి చేసికొనకుండ యున్నంతకాలము అతడి వైధవ్యము పొదిన భార్య (widow)
4. అతడు లేక ఆమె యొక్క కుమారుడు, లేదా పౌత్రుడు (కొడుక్కొడుకు)

లేదా ప్రపౌత్రుడు (great-grand son) పౌత్రుడు ప్రపౌత్రుడు వారి తండ్రిని కోల్పోయిన సందర్భములోను వారి జీవనోపాధికి తగినంత ఆస్తిలేని యెడల ఆ మేరకు వారు ఆధారపడిన వ్యక్తులుగా (dependants గా) పరిగణింపబడుదురు.

5. అతడు లేదా ఆమె యొక్క అవివాహిత కుమార్తెయు; తండ్రిని కోల్పోయిన కొడుకు కూతురు అటులనే తండ్రిని కోల్పోయిన మనుమని కూతురు కూడా జీవనోపాధి పొందుటకు అర్హత కల్గియుందురు.

6. వైధవ్యము పొందిన కుమార్తె తన భర్త ఆస్తి నుండి గాని లేదా ఆమె కుమారుడు, కుమార్తెలనుండి గాని లేదా ఆమె మామగారి ఆస్తి నుండి గాని జీవనోపాధి పొందని కుమార్తెకూడా ఆధారపడిన వ్యక్తిగా పరిగణింపబడును.

7. వైధవ్యము పొందిన కోడలుగాని మనుమని భార్యగాని తమకు మరియొకవిధమైన జీవనోపాధిలేని యెడల ఆమేరకు వారు కూడా ఆధారపడిన వ్యక్తులే అగుదురు.

8. ఏ వ్యక్తికైన అక్రమ సంబంధముచే కల్గిన మైనరు కుమారుడున్న యెడల మెజారిటి వచ్చువరకు అట్టి అక్రమకుమారుడు కూడా ఆధారపడిన వ్యక్తియే అగును.

9. అతడికి లేదా ఆమెకు అక్రమ సంబంధముచే కలిగిన కుమార్తె ఉన్న యెడల ఆమెకు వివాహము అగువరకు ఆధారపడిన వ్యక్తియే అగును.

జీవనోపాధికి ఒక వ్యక్తిపై ఆధారపడిన ఆసామీలుండగా తన ఆస్తి నంతను ఏ సంస్థకైనా విల్లుద్వారా సంక్రమింపజేయుట అధర్మము. అందుచే పై విధముగ చెప్పబడిన వారి జీవనోపాధిని, పోషణను దృష్టిలో ఉంచుకుని వీలునామా వ్రాయవలెను.

# 10వ అధ్యాయం

## విల్లుద్వారా ట్రస్టులను నెలకొల్పుట

ఏ వ్యక్తి అయినను తన ఆస్తిలో కొంత భాగమును ఏదైనా ధర్మ సంస్థకు విల్లుద్వారా సంక్రమింపజేయవచ్చును.

విల్లుద్వారా తానే ఒక ధర్మసంస్థను నెలకొల్పి దానికి కొంత ఆస్తిని సంక్రమింపజేసి సదరు ధర్మసంస్థను (Trust) Management చేయుటకు గాని ట్రస్టీలను గాని నియమించవచ్చును.

ట్రస్టీలను నియమించుటలో వీలునామా వ్రాసిన వ్యక్తి కొన్ని జాగ్రత్తలు తీసికొనవలసియుండును. తనచే నియమింపబడు ట్రస్టీ మైనరు కాకుండా ఉండాలి. సహజముగా తనకంటె వయసులో చిన్నవాడై ఉండడం అవసరం. ఆ ట్రస్టీగాని, ట్రస్టీలుగాని మంచి నడవడి కలిగియుండిన వారలైతే తన అభీష్టము చక్కగా నెరవేరగలదు. సహజముగా తన కుటుంబములోని వారిని నియమించుట చూచుచుందుము. బ్యాంకులను, లాయర్ల కంపెనీలను, ఇతర సంస్థలను కూడా ట్రస్టీలుగా నియమించవచ్చును. కొన్ని సందర్భములలో మున్సిపాల్టీలను కూడా ట్రస్టీగా నియమించబడిన సందర్భములు లేకపోలేదు.

# 11వ అధ్యాయం

## వీలునామాలు వ్రాయడంలో ముఖ్యాంశాలు

దీనికి సంబంధించిన రూల్సు ఇండియన్ సక్సెషన్ చట్టం సెక్షను 63లో చెప్పబడినవి.

వీలునామా వ్రాయునతడు అనగా Testator అని అర్థము. scribe కాడు. వీలునామా ద్వారా ఆస్తిని తన తదనంతరం ఇతరులకు సంక్రమింపజేయు వ్యక్తిని వీలునామా వ్రాయునతడు (Testator) అని పిలువదగును.

వీలునామా వ్రాయునతడు అందుపై సంతకం చేయవలెను - సంతకం చేయుట చేతకాకపోయిన యెడల ఎడమచేతి బొటన వ్రేలి - వ్రేలిముద్ర వేయవలెను. వీలునామా ఒక పేజీకి మించి విస్తరించి ఉన్న యెడల అన్ని పేజీలలోను సంతకములు చేయుటగాని, వేలిముద్ర వేయుట గాని చాలా మంచిది. లేదా వీలునామా వ్రాయునతడి అనుమతిపై అతని సమక్షంలో మరియొక ఆసామీ సంతకం చేయవచ్చును.

## వీలునామాపై సాక్షి సంతకాలు

వీలునామాకు కనీసం ఇద్దరు సాక్షులుండాలి లేదా ఇంకా ఎక్కువమందైనా ఉండవచ్చును. సాక్షులు అందరూ ఒకేసారి సంతకం చేయనక్కర్లేదు. ఇండియన్ సక్సెషన్ చట్టం 63(c) ప్రకారం ప్రతీ వీలునామాకు ఇద్దరు సాక్షులు అవసరం. అందలి ఏ ఒక్క సాక్షియైనా వీలునామా వ్రాయునతడు సంతకము చేయుటో, వేలిముద్ర వేయుటో స్వయంగా చూచినవాడు అయి యుండాలి లేదా వీలునామా వ్రాసిన వాని అనుమతితో మరియొకరు సంతకం చెయ్యడమో వేలిముద్ర వెయ్యడమో ఆ సాక్షి చూచి యుండాలి. లేదా వీలునామా వ్రాసినతడు ఆ సాక్షితో తానే స్వయంగా సంతకం చేసినట్లో లేక వేలిముద్ర వేసినట్లో చెప్పియుంటే అట్టి మాటను పుచ్చుకుని ఆ సాక్షి వీలునామా వ్రాసినతడి ఎదుట సాక్షి సంతకం

చెయ్యవచ్చును. సాక్షిగ్రాలు చేయుటకు ప్రత్యేకమైన నమూనా ఏదీ లేదు. కాని సాక్షిని గుర్తు పట్టుటకు అవకాశం కలిగేటట్టు వివరాలుంటే చాలును. వీలునామా వ్రాయునతడు సంతకం చేయుటో వేలిముద్ర వేయుటో ఇద్దరు సాక్షులు స్వయంగా చూచినవారైతే ఇంకా మంచిది. సాక్షులు సాక్షి సంతకములు చేయుట లేదా వేలిముద్రలు వేయుట వీలునామా వ్రాయునతడు కూడా చూడడం అవసరం. వీలునామా వ్రాయువాని కంటె సాక్షులు వయసులో చిన్నవారుగా ఉండడం చాలా అవసరం.

వీలునామాకు రిజిస్ట్రేషను తప్పనిసరి కాదు. (not a compulsorily registrable document) అయితే రిజిస్ట్రేషను చేయించితే వీలునామా వ్రాసిన వ్యక్తిని గుర్తుపట్టే ఎఱుక సాక్షులను అత్యవసరమని చెప్పబడే ఇద్దరు సాక్షులతో కలపరాదు. ఎఱుక సాక్షులు (Identifying witnesses) యొక్క సాక్ష్యం కూడా అవసరమే. కాని అతి ముఖ్యం కాదు. వీలునామా రిజిస్టరీ చేసిన సబ్ రిజిస్ట్రారు కూడా సాక్షిగా పనికివచ్చును.

వీలునామా వ్రాయు ఆసామీ సాక్షులను జాగ్రత్తగా ఎంపిక చేసుకోవలెను. విద్యావంతులు, తనకంటె వయసులో చిన్నవారు చిరకాలము నుండి తెలిసియుండిన వారు అయిన యెడల మరీ మంచిది. వీలునామాను ఋజువు పరచవలసి వచ్చినపుడు సాక్షుల అవసరం ఎంతైనా కలదు.

# 12వ అధ్యాయం

## వీలునామా ఏ భాషలో వ్రాయాలి?

వీలునామాను వ్రాయునతని మాతృభాషలో వ్రాయుట మంచిది. తెలుగుభాషలో వ్రాయించి, చదివి వినిపించుకుని, సందేహాస్పదమైన పదాలను వాక్యాలను తొలగించి, చదివేసరికి అర్థమయేటట్లు చిన్న చిన్న వాక్యాలలో వ్రాయడం శ్రేష్టం. ఇంగ్లీషు భాషలో వ్రాస్తే దాని construction సరిగా ఉన్నదీ లేనిదీ తెలుసుకుని వీలైతే టైపు చేయించుట మంచి పద్ధతి. అనుభవముకల లాయరుని సంప్రదించి వీలునామా వ్రాయించుకుంటే అనుమానాలకు ఆస్కారం ఉండదు. వీలునామా ఒక నిర్దుష్టశైలిలో వ్రాయనక్కర్లేదు. సాంకేతిక (technical terminology) పదాలు వాడనక్కర్లేదు.

# 13వ అధ్యాయం

## వీలునామా ఎక్కడ (ఏ స్థలంలో) వ్రాయాలి?

వీలునామాను ఏ గ్రామంలోనైనా వ్రాయ వచ్చును. దానికి జూరిస్ డిక్షన్‌తో పనిలేదు. అయితే వీలునామా వ్రాసే వ్యక్తి వ్రాసే సమయానికి ఏ గ్రామ నివాసియో, ఏ మండలం, ఏ జిల్లా - రాష్ట్రానికి చెందినదో వివరంగా వ్రాస్తే అనుమానాలకి అతీతంగా ఉంటుంది.

వీలునామాల నమూనాలు కొన్ని ఈయబడినవి. వాటిని అవసరమైన మార్పులతో వినియోగించుకొనవచ్చును. మానవ జన్మయొక్క ఉనికి అనిశ్చితం గనుక ఏ వ్యక్తి అయినా ఎక్కడ ఉన్నా వీలునామా వ్రాయ వచ్చును.

వీలునామాలో తన తండ్రి-లేదా భర్తపేరు, సుమారుగా తన వయస్సు, తానుచేయు వృత్తి తన కుటుంబ చరిత్ర క్లుప్తంగా వ్రాయడం అవసరం. తాను వీలునామా ఎందుకు వ్రాయుచున్నాడో కూడా వివరిస్తే ఇంకా క్షేమకరం. వివరాలు లేనంతమాత్రానా విల్లు చెల్లుబాటుకు భంగము కలుగదు. తన తదనంతరం తన చర స్థిరాస్తులు ఎవరెవరికి ఎంతెంత భాగం చెందజేయదలచిరో అది స్పష్టంగా వ్రాయడం చాలా అవసరం. అది స్పష్టంగా లేనియెడల వివాదాలకు దారి తీయగలదు.

ఏ ఆస్తి పైన అయినా జీవితకాలపు హక్కు ఒక్కరికి తదనంతరం హక్కు మరియొకరికి ఇవ్వదలచినచో సజీవులైయున్న వారికి ఎంతమందికైనా ఇస్తూ తదనంతరం హక్కు మాత్రం ఒక్క పురుషాంతరానికి లేదా స్త్రీ అంతరానికి (Next generation) కి మాత్రం పరిమితం చెయ్యాలి. Unborn generation కి జీవితకాలపు హక్కు ఇచ్చిన అది చెల్లనేరదు. ధీనినే Rule against Perpetuities అంటారు. Transfer of Property Act Section 14 చూచునది.

వీలునామా చివరిభాగంలోగాని మొదట్లోగాని తాను వ్రాయుచున్న

వీలునామాయే ఆఖరిదైయున్నదని వ్రాయాలి. సదరు వీలునామను మార్పు చేసికొనుటకు రద్దు చేసికొనుటకు హక్కు తనయందుంచుకున్నట్లు కూడా వ్రాయాలి. తాను మంచి తెలివితోను, వ్యవహార జ్ఞానంతోను వీలునామా వ్రాయించినట్లు వ్రాయడం కూడా అవసరం. ఏ సంవత్సరం, నెల తేదీన వ్రాయించేరో అది వీలునామాకు ముందుగాని, చివరనుగాని అంకెలతోను అక్షరాలతోను వ్రాయించడం కూడా అవసరం.

# 14వ అధ్యాయం

## వీలునామా రిజిస్ట్రేషను వలన ప్రయోజనాలు?

వీలునామాకు రిజిస్ట్రేషను అత్యవసరం కాదు. Compulsory కాదని ఇదివరలో తెలుసుకున్నాము. కాని రిజిస్ట్రేషను చేయించినందువలన చాలా అపోహలకు అనుమానాలకు స్వస్తి చెప్పవచ్చును. మొదటి ప్రయోజనం - తాను వ్రాసిన వీలునామా సబ్‌రిజిస్ట్రారు ఆఫీసులో ఎన్ని సంవత్సరాలైనా చెక్కు చెదరకుండా రికార్డ్ అయివుంటుంది. వ్రాయించినతడు జీవించియున్నంతకాలం ఆ వీలునామా నకలు ఎవరికి ఈయరు. వీలునామా వ్రాసిన వ్యక్తి మరణించినట్లు సర్టిఫికేటు దాఖలు చేస్తే కాని ఆ వీలునామాకు నకలు ఈయరు.

వీలునామా వ్రాయునతడు సబ్‌రిజిస్ట్రారు ఆఫీసుకు వెళ్ళలేని అవస్థలో ఉన్నను- ఆస్పత్రిలో చికిత్సపొందుతూ In Patient గా ఉన్నను పబ్‌రిజిస్ట్రారుకు దరఖాస్తు దాఖలు చేయించితే, దానికి నిర్ణయింపబడిన ఫీజు వసూలు చేసి సబ్‌రిజిస్ట్రారు వీలునామా వ్రాయు ఆసామీ ఇంటికి గాని - అస్పత్రికి గాని స్వయంగా వెళ్ళి వీలునామాను రిజిస్టరీ చేయును. ఎంతటి సదుపాయమో గమనించండి.

వీలునామాలోని అంశములు ఎవరికి తెలియబడకుండ ఉంచాలంటే వీలునామాను సక్రమంగా వ్రాయించి, సాక్షి సంతకాలు చేయించి సబ్ రిజిస్ట్రారు ఆఫీసుకు తీసుకు వెళ్ళి సబ్ రిజిస్ట్రారు ఎదుట ఆ వీలునామాను ఒక కవరులో ఉంచి సీలు వేసి సబ్ రిజిస్ట్రారుకు ఈయవచ్చును. దానిని సబ్ రిజిస్ట్రారు ఆఫీసు వారు fire proof box లో భద్రపరచెదరు. వీలునామా వ్రాసినతడు మరణించిన తరువాత, మరణ సర్టిఫికేటు దాఖలు చేసి సీల్డు కవరును బహిర్గతం చేయించి ఆ వీలునామాను రిజిస్టరీ చేయించవచ్చును. వీలునామా వ్రాసిన ఆసామీ మరణించినట్లు సర్టిఫికేటు ద్వారా ధృవపరిస్తే ఆ వీలునామాకు సంబంధించిన వ్యక్తులు సబ్ రిజిస్ట్రారు ఆఫీసు నుండి పబ్లిక్ నకళ్ళు కూడా పొందవచ్చును.

# 15వ అధ్యాయం

## వీలునామాను ఋజువు పరచుట!

దస్తావేజులు, పత్రములు, ఇతర లిఖితములను ఋజువు చేయు పద్ధతియే వీలునామాకు కూడా అనుసరించదగును. ఒక ప్రత్యేకత ఏమనగా ఇద్దరు సాక్షులు మాత్రం (వీలునామాలో సంతకం చేసిన Attesting Witness) అత్యవసరం. వీలునామా వ్రాసినతడిది ఇదే ఆఖరి వీలునామా అని ఋజువు చేయవలసి యుండును. వీలునామా ద్వారా లబ్ధిపొందు వ్యక్తులు సదరు వీలునామా వ్రాసినతడి శారీరక మానసిక పరిస్థితులు, వ్యవహార జ్ఞానమును గురించి కూడా ఋజువు చేయుట అవసరం. అనుమానాలకు అపోహలకు తావు లేకుండ వీలునామాను ఋజువు చేయవలసియున్నది. ఈ సందర్భమున Indian Evidence Act Sections 67, 68 మరియు 90 యున్ను, Indian Succenion Act Section 63 కూడా గమనించవలసియున్నది.

# 16వ అధ్యాయం

## CODICILS (కోడిసిల్సు)

కోడిసిల్‌ను వీలునామాకు అనుబంధముగా (Supplement) చేర్చవచ్చును. వీలునామాలో వ్రాయబడిన అంశములను వివరించవచ్చును, మార్పు చేయవచ్చును, కొత్త విషయాలు చేర్చవచ్చును. కోడిసిల్ వీలునామాలోని భాగముగ పరిగణింపబడును. వీలునామా వ్రాయుటలో గల జాగ్రత్తలన్ని కొడిసిల్‌కు కూడా వర్తించును. ఇద్దరు సాక్షులు కూడా అవసరం. వేరె కాగితము పైన వ్రాయవచ్చును. లేదా వీలునామా వెనుక భాగమున కూడా వ్రాయవచ్చును (Endorsed on the will)

వీలునామా వ్రాసిన మరికొన్ని దినములకు వ్రాసినతడు తనకు కొత్త ఆలోచనలు కలిగిన యెడల వాటిని వీలునామాలో కొడిసిల్ రూపంలో చేర్చవచ్చును. వీలునామాతో కలిపే కొడిసిల్‌ను చదవాలి. ఇది యొక ప్రత్యేకమైన పత్రం కాదని గుర్తుంచుకోవాలి.

చేయదగిన మార్పులు, చేర్పులు ఎక్కువగా ఉన్న యెడల వాటిని కోడిసిల్ ద్వారా వ్రాయడంకంటె కొత్తగా మరియొక వీలునామా వ్రాస్తే బాగుండునేమో ఆలోచించుకోవాలి. వీలునామాలు ఎన్నయినా వ్రాయవచ్చు. అయితే ఆఖరి వీలునామాయే అమలులోనికి వచ్చేదని గుర్తించాలి.

# 17వ అధ్యాయం

## విల్లును రద్దు చేయుట - మార్పు చేయుట।

ఇండియన్ సక్సెషన్ ఏక్ట్ సెక్షను 62 ప్రకారం వీలునామాను రద్దు చేయ వచ్చును మార్పు చేయవచ్చును.

వీలునామాను కొడిసిల్ వ్రాయడం ద్వారా మార్పు చేయవచ్చును.

అసలు వీలునామాను ముక్కలు ముక్కలుగా చింపివేయుట ద్వారాను, తగులబెట్టుట ద్వారా కూడా రద్దు చేయవచ్చును. లేదా మరియొక వీలునామా వ్రాయడం ద్వారా కూడా రద్దు చేయవచ్చును. మరల వివాహం చేసుకుంటే వీలు రద్దుగును.

తాను వ్రాయించిన వీలునామాను రద్దుపరచి మరియొక వీలునామా వ్రాయకుండా సదరు వ్యక్తి మరణిస్తే ఆ వ్యక్తి Inntestate గా మరణించినట్లు భావించబడును. అతడి యొక్క లేదా ఆమె యొక్క ఆస్తి వారసత్వ రీత్యా మరణించిన వాని సన్నిహిత వారసులకు దఖలుపడును.

## Revocation of a will

Indian Successtion Act Section 70 ప్రకారం పైన చెప్పిన విధముగ వీలునామాను Revoke చేయవచ్చును.

# 18వ అధ్యాయం

## వీలునామాను అమలు జరిపే ఆసామీ ఎగ్జిక్యూటర్(Executor)

ఎగ్జిక్యూటరు అంటే ఎవరో ఇండియన్ సక్సెషన్ ఏక్ట్ నిర్వచనం ఇచ్చింది Section 2(C)

వీలునామా వ్రాసినతడు తన తదనంతరం తన-చివరి వీలునామా ద్వారా తాను వ్రాసిన ప్రకారం వీలునామాను అమలు పరచుటకు ఏ ఆసామీకి తన వీలునామా ద్వారా అధికార మిచ్చునో అతడే ఎగ్జిక్యూటరు. ఇంగ్లీషు నిర్వచనము కూడా చూడండి.

2(C) "Executor means a Person to whom the execution of the last will of a deceased Person, Is by the Testator's appointment Confided"

ఎగ్జిక్యూటరు సదరు వీలునామా ద్వారా లబ్ధిపొందు వ్యక్తి కూడా అయి యుండవచ్చును. ఎగ్జిక్యూటర్లు ఒకరికి మించి కూడా ఉండవచ్చు. వీలునామా ద్వారా ఎగ్జిక్యూటరును నియమించుటలో కొన్ని జాగ్రత్తలు, మెలకువలు పాటించవలసియున్నది. సహజముగ వీలునామ వ్రాసిన ఆసామీ కంటె వయసులో చిన్న వానిని ఎగ్జిక్యూటరుగా నియమిస్తే వీలునామాను ఆక్షేపణ లేకుండ అమలు జరుపుటకు వీలగును. వీలునామా ద్వారా సంక్రమింపజేయు చరస్థిరాస్తులు ఏ వూరిలో ఉన్నవో ఆ ఊరి నివాసిని ఎగ్జిక్యూటరుగా నియమిస్తే అతడు ఎక్కువ పర్యాయములు ప్రయాణములు చేయు అవసరం ఉండదు. వీలునామా వ్రాసినతని బంధువులలో ఎవరైనా అర్హత కలిగిన వారున్న యెడల వారిని ఎగ్జిక్యూటరుగా నియమించవచ్చును. ఎగ్జిక్యూటరు సహజముగ మంచినడవడి కలవాడై యుండడం చాలా అవసరం. వీలునామా ద్వారా ఎగ్జిక్యూటరును నియమించినపుడు అట్టి ఎగ్జిక్యూటరుకు ఈయదగు పరిహారము (Remuneration) కూడా సదరు వీలునామాలో వ్రాయడం ఉత్తమం - పరిహారం గురించి వ్రాయని యెడల సదరు ఎగ్జిక్యూటరు కోర్టులో పిటీషను దాఖలు చేసి పరిహారము నిర్ణయింప

చేసికొనవచ్చును. వీలునామా వ్రాసినతడు మరణించినంతట ఎగ్జిక్యూటరు సదరు వీలునామాను ప్రోబేటుకై కోర్టులో దాఖలు చేసి కోర్టు ఆర్డరును పొందవచ్చును. వీలునామాను ఋజువు చేయవలసియుండును. వీలునామాను ఋజువు పరచినంతట Competent కోర్టు ఎగ్జిక్యూటరుకు ప్రోబేటును- వీలునామాను జతపరచి మంజూరు చేయును (Probate with will annexed will be granted) ఎగ్జిక్యూటరు అంతట మరణించిన ఆసామీ యొక్క చరస్థిరాస్తుల పట్టీని (Inventory) తయారు చేయవలెను. వీలునామా వ్రాసి మరణించిన ఆసామీ యొక్క దినం ఖర్చులకు (Funeral Expenses) ముందుగా ప్రాధాన్యత ఈయబడును. ఆ ఖర్చులు - అప్పులు తీర్చిన పిమ్మట వీలునామా వ్రాసి మరణించిన ఆసామీ తన మరణానికి ఒక నెల ముందుగా వైద్యం చేయించుకొనిన ఖర్చులు అప్పులు తీర్చవలెను. సదరు ఆసామీని అతడి మరణానికి మూడు నెలల ముందు నుంచి కనిపెట్టుకొని ఉండి సేవలు అందించిన అసామీలకు, నౌకరుకు జీతము ఇచ్చి వేయవలెను, తాను ప్రొబేటు గాని Letters of administration గాని కోర్టు నుండి పొందుటకు చేసిన ఖర్చును కూడా తాను మినహాయించుకొనవచ్చును.

వీలునామా వ్రాసి మరణించిన ఆసామీ యొక్క ఇతర ఋణములను పైన చెప్పిన వాటి తదనంతరం ఎగ్జిక్యూటరు తీర్చాలి. తాను చేసిన విధులన్నిటిని ఎప్పటికప్పుడు ఎగ్జిక్యూటరు ఆయా నిర్ణీత సమయములందు కోర్టుకు విశదపరచాలి. అవసరమైతే directions కూడా పొందవచ్చు.

వీలునామా ద్వారా లబ్ధిని కూడా పొందు ఆసామీయే ఎగ్జిక్యూటరు అయితే సదరు వీలునామాను అమలు జరుపుటకు ఉత్సాహము చూపించి ముందుకు వచ్చి కార్యకలాపములు జరుపుట మొదలిడక పోతే అట్టి ఎగ్జిక్యూటరు సదరు వీలునామాలో వ్రాయబడిన లబ్ధిని పొందుటకు అర్హత కోల్పోవును. వీలునామాలో నియమింపబడిన ఎగ్జిక్యూటరు వీలునామా వ్రాసిన ఆసామీ మరణించంనంతట దినవారము ఏర్పాట్లు, అందుకు తగిన ఖర్చులు పెట్టడం మొదలుపెడితే అతడు తన ఉత్సాహమును చూపినట్లే పరిగణించాలి.

## ఎగ్జిక్యూటరు అవసరమా?

నిజానికి ఎగ్జిక్యూటరు అవసరం లేదు. ఎగ్జిక్యూటరును నియమించనంత మాత్రాన వీలునామాకు భంగంలేదు. వీలునామా ద్వారా లబ్ధిని పొందెడి ఏ వ్యక్తినైనా Competent Court - Administrator గా నియమించి వానికి Letters of Administration with will Annexed ఇచ్చి వీలునామాను అమలు జరిపించవచ్చును.

ఎగ్జిక్యూటరును నియమించడం compulsory కాదు. Bankersని కాని Solicitorsని కాని ఎగ్జిక్యూటర్సుగా నియమించవచ్చును.

వీలునామా ద్వారా సంక్రమింపజేసెడి ఆస్తి యొక్క విలువను బట్టి, నిర్వహించవలసిన విధులను బట్టి (duties to the discharged) ఎగ్జిక్యూటరు యొక్క పరిహారమును నిర్ణయింపదగును.

## పరిపాలకుడు (Administrator)

పరిపాలకుడు లేక ఎడ్మినిస్ట్రేటరు పదాన్ని ఇండియన్ సక్సెషన్ యాక్టు నిర్వచించింది. Sec. 2 (a)

"ఎగ్జిక్యూటరు లేని సందర్భములలో మరణించినవాని ఆస్తులను పరిపాలించుటకుగాని అర్హత పొందిన అధికారిచే నియమింపబడిన వ్యక్తిని ఎడ్మినిస్ట్రేటరు అందురు" ఇంగ్లీషు నిర్వచనం కూడా చూడండి:

2 (a) "Administrator means a person appointed by competent authority to administer the estate of a deceased person when there is no executor"

ఎడ్మినిస్ట్రేటరును competent authority యే నియమించునని గుర్తుంచుకోవాలి. వీలునామా ద్వారా లబ్ధి పొందు ఆసామీలలో ఏ ఒకరినైనాగాని సామర్ధ్యమును బట్టి మరణించినవాని ఎస్టేటును (ఆస్తుల సముదాయమును)

వీలునామాలో వ్రాసిన ప్రకారం ఆయా లబ్దిదారులకు సంక్రమింప జేయుటకు, మరణించిన వాని బాకీలు తీర్చుటకు, రావలసిన సొమ్ములు వసూళ్ళు చేయుటకు, అవసరం వెంబడిని కోర్టు వ్యవహారాలు చూచుటకు ఎడ్మినిస్ట్రేరుకు అధికారం ఈయుబడును. అధికారం ఈయుబడిన పత్రమునే Letters of Administration అంటారు. Letters of Administration నమూనా ఈయబడినది.

ఎడ్మినిస్ట్రేటరు తాను నిర్వహించిన కార్యముల వివరములను మొత్తం వ్యవహారం పూర్తి అయేవరకు తనను నియమించిన competent authority కి ఆయా సమయములందు నివేదికగా తెలియ పరచుచుండవలెను.

# 20వ అధ్యాయం

## ప్రోబేటు (Probate)

ప్రోబేటు అంటే సాధారణంగా జిల్లా జడ్జి, లేదా రిజ(స్ట్రారు చేత ఈయబడిన ఆర్డరు. ఈ ఆర్డరుపై ఇచ్చువాని సంతకం - వాని సీలు (seal) ఉండాలి. దానితోబాటు విల్లు (will) కాపీని కూడా జతపరచాలి. విల్లు కాపీని జతపరచని ప్రోబేటు చెల్లనేరదు. నిరర్ధకం ప్రోబేటును సాధారణంగా విల్లును అమలు జరుపు ఆసామీకి (executor) గాని లేదా విల్లు ద్వారా లబ్ధిని పొందు ఆసామీకి గానికి ఈయబడును.

ప్రోబేటు ఆర్డరు పొందదలచిన ఆసామీ (executor) గాని లబ్ధిదారుడుగాని అందు నిమిత్తం జిల్లా జడ్జి కోర్టులో దరఖాస్తు దాఖలు చెయ్యాలి. ఏ జిల్లా జడ్జి కోర్టు యొక్క Jurisdiction లో వీలునామా ద్వారా సంక్రమింపజేసే ఆస్థులున్నాయో లేదా ఏ కొన్ని అయినా ఉన్నాయో ఆ జిల్లా జడ్జి కోర్టులో దరఖాస్తు దాఖలు చెయ్యాలి. దరఖాస్తుతోబాటు వీలునామాను దాఖలు చెయ్యాలి. వీలునామా వ్రాసిన ఆసామీ మరణించిన తేది మరణమును ధృవపరిచే death extract ను కూడా దాఖలు చెయ్యాలి. దాఖలు చేయబడినదే ఆఖరి వీలునామా అని ఋజువు (Proof) చెయ్యాలి. సాక్షులను విచారణ చెయ్యాలి. వీలునామా వ్రాసినతడు మంచి తెలివితోను, వ్యవహార జ్ఞానంతో వ్రాసినట్లు ఋజువు చెయ్యాలి. దరఖాస్తుదారుడే executor అని గాని లేదా లబ్ధిదారుడని కూడా ఋజువు పరచాలి. వీలునామా ద్వారా సంక్రమింపజేసే ఆస్తుల వివరంకూడా తెలియ జెయ్యాలి.

అన్ని విధాలా దరఖాస్తు సవ్యంగా ఉంటే వీలునామా వ్రాసినవాని బంధువులకు జ్ఞాతులకు కోర్టు నోటీసు పంపుతుంది. అంతేకాక ఆ ప్రాంతంలో విశేష ప్రచారంగల దినపత్రికలో కూడా general publicకి నోటీసును అందజేస్తారు. నిర్ణయింపబడిన వాయిదా రోజున పైన తెలుపబడిన ఆసామీ ఎవరైనా ప్రొబేటు ఇచ్చుటకు వీలులేదని అభ్యంతరాలు తెలిపితే వాటియందలి సత్య - అసత్యములను కోర్టు విచారించి

వీలునామా ఋజువైతే అభ్యంతరాలను త్రోసిపుచ్చి ప్రోబేటును grant చేస్తుంది. ఒకమారు ప్రోబేటు grant అయితే title ఋజువైనట్లే, ఆకోర్టు ఆర్డరును ప్రోబేటుతో వీలునామా కాపీని జతపరచి ఇస్తే executor గాని, లబ్దిదారుడుగాని వీలునామాలోని ఆస్తులన్నిటిని అందులో వ్రాయబడిన ప్రకారం- స్వాధీనము చేసికొనుట, ఇతరులకు ఇచ్చుట, రావలసిన బాకీలు వగైరాలు రాబట్టుకొనుట మొదలగు వ్యవహారములు నిరాటంకముగ జరిగించవచ్చును. జిల్లా జడ్జి వేసిన ఆర్డరుపై హైకోర్టుకు అప్పీలు చేసికొనుటకు అధికారము కలదు. Indian Succession Act, Section 299 ప్రకారం అప్పీలు చేసికొనవచ్చును.

ప్రొబేటు Letters of Administration grant చేయుటకు జిల్లా జడ్జీకి హైకోర్టుకు సమానాధికారములే (Concurrent Jurisdiction) కలవు. ఇండియన్ సక్సెషన్ ఆక్టు సెక్షను 300 (1) చూచునది.

executor ని తప్పించే అధికారం కూడా హైకోర్టుకి కలదు.

ఇండియన్ సక్సెషన్ Act సెక్షను 302 ప్రకారం Executor గాని లేదా వీలునామాకు సంబంధించిన ఇతర ఆసామీ ఎవరైనా ధరఖాస్తు చేస్తే హైకోర్టు విచారణ జరిగించి Executor గాని Administrator కి గాని ఉచితమైన dirrection's ఇచ్చే అధికారం హైకోర్టుకి కలదు.

ప్రోబేటు యొక్క నమూనాను అనుబంధములో చేర్చబడమైనది.

Secion 222 of Indian Succention Act

1. Probate shall be granted only to an executor appointed by the will
2. The appointment may be expressed or by necessary implication

వీలునామలో పేర్కొనబడిన లబ్దిదారుల ప్రయోజనం నిమిత్తం వీలునామా యొక్క నిజాయితీని నిరూపించవలసియున్నది. అప్పుడే Probate గాని Letters of Administration గాని ఈయవీలగును.

గోవింద్ Vs. Jairam AIR 1963 Madras 456 తీర్పు గమనించునది..

## వీలునామాను రద్దు చేయవలసిన లేదా మార్పు చేయవలసిన అగత్యమేమి?

ముఖ్యంగా గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే వీలునామా వ్రాసిన వాని మరణానంతరమే Will అమలు లోనికి వస్తుందని : అయితే వీలునామా వ్రాసిన అనంతరం వ్రాసిన వ్యక్తి యొక్క కుటుంబ, ఆర్థిక, పరిస్థితులలో మార్పులు రావచ్చును. వీలునామా వ్రాసిన అనంతరం వ్రాసిన వ్యక్తి కొత్తగా మరియొక ఇంటినిగాని భూవసతిగాని సంపాదించవచ్చును. పాత ఆస్తులను విక్రయించవచ్చును. లేదా తన కుటుంబ పరిస్థితులలో మార్పు రావచ్చు. తాను మరియొక వివాహము జరిగించుకొనవచ్చు. విడాకులు పొందవచ్చు. ఇట్టి సందర్భాలలో లోగడ వ్రాసిన వీలునామాను రద్దుపరచి మరియొకటి వ్రాయుట శ్రేయస్కరం. ఇంకను వీలునామా ద్వారా appoint చేయబడిన executor తన కంటె ముందుగా మరణించవచ్చు; వీలునామాలో సాక్షివ్రాలు చేసిన attestor తనకంటె ముందుగా మరణిస్తే వీలునామా లబ్ధిదారులు ఆ వీలునామాను ఋజువుచేసికొనుట కష్టమగును. వీలునామా ద్వారా ఆస్తిని చెందజేయబడిన లబ్ధిదారులెవరైనా తనకంటె ముందుగా మరణించవచ్చును. పైన వ్రాయబడినవే కాక ఇంకేమైనా అనూహ్యమైన సంఘటనలు జరిగినను తాను వ్రాసిన వీలునామాను రద్దుచేయవచ్చును. మార్పుచేయవచ్చును. కోడిసిల్ వ్రాయడం ద్వారా.

# 21వ అధ్యాయం

## వారసత్వం సర్టిఫికేటును మంజూరు చేయుట (Grant of succession certificate)

ఇండియన్ సక్సెషను చట్టం 10వ భాగంలో వివరంగా వ్రాయబడిన ప్రకారం ఎవరైనా వ్యక్తి తాను రాబట్టుకోదలచిన బకాయిలు (debts) సెక్యూరిటీలు (Securities) రాబట్టు కొనుటకు తనకు వీలునామా ద్వారా సంక్రమించిన హక్కును నిర్ధారణ చేయు నిమిత్తం వారసత్వ సర్టిఫికేటును పొందవచ్చును. ప్రాంసరీ నోటు బాకీలు, కంపెనీలలోని షేర్లు, డిబెంచర్లు, ఇతర సెక్యూరిటీలు కూడా "సెక్యూరిటీ" అనే పదం క్రిందికే వస్తాయి. Section 370 చూచునది.

వారసత్వం సర్టిఫికేటును ఇప్పించమని జిల్లా జడ్జికోర్టులో దరఖాస్తు చేయవలెను. చనిపోయిన ఆసామీ (వీలునామా వ్రాసిన యతడు) సాధారణముగ ఏ జిల్లా జడ్జి జూరిస్‌డిక్షనులో నివసించెడివాడో గాని లేదా చనిపోయిన ఆసామీ యొక్క ఏకొంత ఆస్తియైనా ఏ జిల్లా జడ్జి జూరిస్‌డిక్షనులో ఉన్నదో ఆ జిల్లా జడ్జీ కోర్టులోగాని సర్టిఫికేటు నిమిత్తం దరఖాస్తు చేయవలెను. జిల్లా జడ్జి అనగా అదనపు జిల్లా జడ్జి అనికూడా తెలియనగును. సివిల్‌కోర్టుల చట్టముల సవరణల ద్వారాను, రాష్ట్ర ప్రభుత్వములకు సంక్రమించిన అధికారముల ననుసరించి మరియు Section 388 of Indian Succession Act ను బట్టి ఆయా సమయాలలో జారీ చేయబడిన ల G.O. ల ద్వారాను సక్సెషన్ సర్టిఫికేటు మంజూరు చేయు అధికారము జిల్లా జడ్జీలకే కాక ఇతర జూనియర్, సీనియర్ సివిల్ జడ్జీలకు కూడా సంక్రమింపజేయబడినది. అయితే సక్సెషన్ సర్టిఫికేటును వినియోగించి రాబట్టుకొను బకాయిలు సెక్యూరిటీల విలువనుబట్టి ఏ కోర్టులో దరఖాస్తు చేయవలెనో నిర్ణయించుకోవాలి. (Section 371 చూడవలెను.)

వారసత్వం సర్టిఫికేటు ఇప్పించమని కోరు దరఖాస్తుదారుడు పిటీషను దాఖలు

చెయ్యాలి. సదరు పిటీషను సివిల్ ప్రొసీజరు కోడ్‌లో వివరించిన ప్రకారం ప్లయింట్లు Written statements ఏ పద్ధతిలో వ్రాయబడి, ధృవపరచబడతాయో అదే నమూనాలో వారసత్వం సర్టిఫికేటు నిమిత్తం దాఖలు చేయబడే పిటీషను కూడా వ్రాయబడి సంతకములు చేయబడి ధృవీకరింపబడాలి (verified petition) అని తెలుసుకోవాలి. ఆ పిటీషనులో వ్రాయవలసిన వివరాలు ఈవిధంగా ఉండాలి.

(ఎ) చనిపోయిన వాని మరణ సమయం (time of death)

(బి) చనిపోయిన సమయంలో ఆతడు నివసించియుండెడి స్థలము (ordinary residence of the deceased) లేదా చనిపోవు సమయానికి ఆ ఆసామీకి ఆస్తులు ఏ కోర్టు జూరిస్‌డిక్షనులో ఉన్నవో వాని వివరాలు;

(సి) చనిపోయిన వాని కుటుంబ సభ్యులు లేదా వాని బంధువుల యొక్క వివరాలు వారి వారి నివాస స్థలాలు;

(డి) పిటీషనరు కోరెడి హక్కు

(ఇ) ఇండియన్ సక్సెషన్ చట్టం 370వ సెక్షను ప్రకారం సర్టిఫికేటు మంజూరు చేయుటకు అవరోధములు ఏవియు లేవు కద

(ఎఫ్) ఏయే బకాయిలు, సెక్యూరిటీలు రాబట్టుకొనే నిమిత్తం అధికారాన్ని కోరుతూ పిటీషను దాఖలు చేయబడినదో ఆ బకాయిల యొక్క, సెక్యూరిటీల యొక్క విలువలు వివరాలు వ్రాయాలి.

చనిపోయిన వానికి రావలసియున్న బాకీగాని బాకీలుగాని, లేదా బాకీలో ఏ కొంత భాగము రావలసియున్నను వాటిని రాబట్టుకొను నిమిత్తం పిటీషను దాఖలు చేయవచ్చును.

అయితే తనచే దాఖలు చేయబడిన పిటీషనులోని ఏ అంశము లేదా అంశములైనా నిజమైనవి కావని తనకు తెలిసియున్నను లేదా అవి అబద్ధమని తాను నమ్మినను అట్టి అంశములు వ్రాసినందుకు దరఖాస్తుదారుడు Section 198 of IPC ప్రకారం శిక్షకు గురియగును.

సక్సెషన్ సర్టిఫికేటును మంజూరు చేయుటకు అన్ని విధముల దరఖాస్తు సక్రమముగ ఉన్నయెడల జిల్లా జడ్జి ఒక తేది నిర్ణయించి పబ్లిక్ నోటీసు జారీచేయించవలెను. నిర్ణయింపబడిన తేదీని అభ్యంతరము చెప్పువారు లేకపోయినను, చెప్పిన అభ్యంతరములు తోసిపుచ్చెడివిగా ఉన్నను సూక్ష్మముగా (summary enquiry) విచారణ జరిగించి సర్టిఫికేటు మంజూరు చేయుటకు ఆర్డరు వేయవలెను.

ఒకరికంటె ఎక్కువమంది పిటీషనర్లున్నచో చనిపోయిన వాని ఆస్తియందు అనగా బకాయిలు-సెక్యూరిటీలయందు వీలునామా ప్రకారం ఆయా ఆసామీలకు కల్పించబడిన వాటాల వరబడిని వారు రాబట్టుకొనుటకు ఆర్డరు వేయవలెను.

సర్టిఫికేటు జారీ చేయు విచారణలో ఏవైన జటిలమైన, క్లిష్టమైన పరిస్థితులు ఏర్పడినను (Intricate and difficult) సూక్ష్మముగ summary గా విచారణ జరిగించి prima facie case ఉన్న ఆసామీకి వారసత్వం సర్టిఫికేటు జారీ చేయవలసి యున్నది. See Section 373 of Indian Succession Act.

దరఖాస్తుదారుకంటె ఎక్కువ హక్కు చూపించగల ఆసామీలు లేకపోయినను, రిజిస్టర్డు వీలునామా దాఖలు చేయబడిన యెడల సదరు పిటీషనరుకు సర్టిఫికేటు ఇచ్చివేయాలని A.P. హైకోర్టు తీర్పు చెప్పినది.

మధ్వపతి వెంకటక్రిష్ణారావు Vs. పండిత నర్సుబాయి AIR 1954 A.P page 23 at 24 తీర్పు చూచునది.

విచారణ పూర్తి అవకముందే పిటీషనరు చనిపోయిన యెడల చనిపోయిన పిటీషనరుకు వారసులను చేర్చుటకు వీలులేదు. పిటీషను వ్యవహారం రద్దు అగును. (lapsed) 48 Calcutta weekly notes page 673 చూచునది.

వారసత్వం సర్టిఫికేటు మంజూరు చేయునెడల అందులో పిటీషనరు రాబట్టుకొనవలసిన బకాయిలు, సెక్యూరిటీలు వివరముగా వ్రాయబడవలెను.

క్లిష్ట సమస్యలు ఉత్పన్నమైన సందర్భాలలో జిల్లాజడ్జి సక్సెషన్ సర్టిఫికేటు మంజూరు చేయుటకు ముందుగా పిటీషనరును హామీ ఇవ్వమని కోరవచ్చును.

ఏదేని బకాయిని గురించిగాని, సెక్యూరిటీ గురించిగాని దరఖాస్తుదారు విస్తరణ extension certificate ను కోరవచ్చును. ఆ ప్రకారం ఈయబడిన extended సర్టిఫికేటు కూడ మొదట ఈయబడిన సర్టిఫికేటువలెనే అధికారము కలిగియుండును.

సక్సెషన్ సర్టిఫికేటు నిమిత్తం చేయు దరఖాస్తుతోబాటు కోర్టుఫీజు చట్టం ప్రకారం నిర్ణయించబడిన సొమ్ము డిపోజిట్ చేసినట్లు చలానా కూడా జతపరచ వలెను. సక్సెషన్ సర్టిఫికేటు ఇచ్చుటకు ఆర్డరు వేయబడిన యెడల సదరు సొమ్ముతో స్టాంపు తెప్పించి అందుపై సర్టిఫికేటు వ్రాయించి ఇప్పించవలెను.

ఒకవేళ దరఖాస్తుదారుకు సక్సెషన్ సర్టిఫికేటు మంజూరు చేయుటకు కోర్టు నిరాకరించిన యెడల అతడు డిపోజిట్ చేసిన సొమ్మును దరఖాస్తుదారుకు తిరిగి ఇచ్చివేయవలెను.

ఇందుల చెప్పబడిన ప్రకారం జడ్జీచే ఈయబడిన సర్టిఫికేటు ఇండియాలో అంతట అమలు జరుగును. (Section 380)

పైవిధముగ ఈయబడిన వారసత్వం సర్టిఫికేటు ఆధారంగా అందులో చెప్పబడిన బాకీలు తీర్చిన ఆసామీలకు, సెక్యూరిటీలను బదిలీ చేసినవారికి కూడా తగినంత రక్షణ కల్పించబడినది. (Section 381)

ఈ 10వ భాగమునునుసరించి జారీచేయబడిన సర్టిఫికేటును కొన్ని సందర్భాలలో త్రిప్పివేయవచ్చును. Revoke చేయవచ్చును అవేవనగా:

(ఎ) సర్టిఫికేటును పొందుటకు అనుసరించిన వ్యవహారము లోపభూయిష్టము గా ఉన్నను;

(బి) మోసపూరితమైన (fraudulent) ఉద్దేశముతో పిటీషనులో అంశములు వ్రాయించినను లేదా బుద్ధి పూర్వకముగ కొన్ని ముఖ్యమైన అంశములను పిటీషనులో తెలియపరచకపోయినను;

(సి) పొరబాటుచేతగాని, అజ్ఞానంచేత గాని అసత్యపు అంశములను పిటీషనులో వ్రాయించి సర్టిఫికేటు పొందినను;

(డి) ఏవేని కారణములచే జారీ చేయబడిన సర్టిఫికేటు నిరుపయోగమై పోయినను (useless)

(ఇ) సర్టిఫికేటులో చెప్పబడిన బాకీలు గురించిగాని సెక్యూరిటీలకు సంబంధించిగాని అధికారముగల మరియొక కోర్టు ఏదేని డిక్రీగాని ఆర్డరుగాని పాస్ చేసినను;

వాటికి సంబంధించిన వారసత్వం సర్టిఫికేటు Revoke చేయబడును. (See Sec 383)

# 22వ అధ్యాయం

జిల్లా జడ్జి వారసత్వం సర్టిఫికేటును మంజూరు చేయుచు, లేదా మంజూరు చేయుటకు నిరాకరిస్తూ లేదా Revoke చేస్తూ వేయబడిన ఆర్డరుపై హైకోర్టుకు అప్పీలు దాఖలు చేసికొనవచ్చును; అందుపై హైకోర్టు వారికి న్యాయమని తోచిన ఆసామీకి సక్సెషన్ సర్టిఫికేటు మంజూరు చేయవలసినదిగా ఆదేశం direction ఇవ్వవచ్చును. ఇదివరలో ఈయబడిన సర్టిఫికేటును రద్దు చేస్తూ (supercession) పైవిధముగ ఆర్డరు వేయవచ్చును.

అయితే code of civil procedure Act V of 1908 ప్రకారం అనుమతించబడిన గడువులోపుగనే అప్పీలు దాఖలు చేసికొనవలెను. (section 384)

ఈ సందర్భమున section 388 కలిపి చదువుట ముఖ్యావసరము.

జిల్లా జడ్జి కంటె తక్కువస్థాయి కోర్టులచే ఈయబడిన వారసత్వం సర్టిఫికేటు ఆర్డరు లేదా ఇచ్చుటకు నిరాకరింపబడిన ఆర్డరుపై హైకోర్టుకు కాక జిల్లా జడ్జీ కోర్టులోనే అప్పీలు దాఖలు చేసికొనవలసియున్నది.

# 23వ అధ్యాయం

## వీలూనామాను డిపోజిట్ చేయుట:

రిజిస్ట్రేషన్ Act part IX section 41 ప్రకారం వీలునామా వ్రాసిన ఆసామీ (testator) తాను స్వయంగా గాని, అధికారం ఈయబడిన ఏజెంటు ద్వారా గాని రిజిస్ట్రారు వద్ద సీల్డు కవరులో తాను వ్రాసిన వీలునామాను పెట్టి కవరుపై తన పేరు లేదా ఏజంటు పేరుతో కలిపి తనపేరు జోడించి వ్రాయించి ఆ డాక్యుమెంటు వివరం కూడా వ్రాసి డిపోజిటు చేయవచ్చును.

డిపోజిటు నిమిత్తం ఈయబడిన సీల్డు కవరును రిజిస్ట్రారు తీసికొని తనకందించిన ఆసామీయే వీలునామా వ్రాసిన వాడని తృప్తి చెందినచో book No.5 లో సీల్డు కవరు వ్యవహారం అంతయు వ్రాసి - ఏ సంవత్సరం, నెల, వారం తేదీ- సమయములో తనకు అందజేయబడినదో మరియు Testator ను ఎరుకపరచిన ఆసామీల వివరాలు కూడా ఆ book No.5 లో వ్రాయవలెను.

తరువాత సదరు సీల్డు కవరును fire proof box లో రిజిస్ట్రారు భద్రపరచవలెను. (section 43 of registration act) చూచునది.

ఏ కారణం చేతనైనా తాను డిపోజిట్ చేసిన కవరును వెనుకకు తీసికొనదలచిన యెడల అట్టి ఆసామీ అందునిమిత్తం రిజిస్ట్రారుకు దరఖాస్తు చేసుకోవలెను. దరఖాస్తుదారుడే సీల్డు కవరును డిపోజిట్ చేసిన ఆసామీ అని రిజిస్ట్రారు సంతృప్తి చెందితే ఆ ఆసామీకి రిజిస్ట్రారు ఆ కవరును ఇచ్చివేయవచ్చును. (see section 44 of registration Act.)

డిపోజిట్ చేసిన ఆసామీ మరణానంతరం ఆకవరును తెరపించవలసినదిగా దరఖాస్తు చేయబడిన యెడల, వీలునామా వ్రాసినతడు మరణించినట్లు రిజిస్ట్రారుకు నమ్మకం కలిగితే, దరఖాస్తుదారు సమక్షంలో సదరు సీల్డు కవరును తెరిపించి,

దరఖాస్తుదారు ఖర్చుపై సదరు వీలునామాను book No.3 లో కాపీ చేయించవచ్చును.

పైవిధముగ Book No.3 లో వీలునామాను కాపీ చేయించిన అనంతరం సదరు original వీలునామాను తిరిగి re-deposit చేయవలెను.

# 24వ అధ్యాయం

## పలురకాల వీలునామాలు (joint and mutual wills)

జాయింటు వీలునామాకు Lord Hals bury ఈ క్రిందివిధముగ నిర్వచనం ఇచ్చినారు.

"A joint will is a will made by two or more Testators contained in a single document, duly executed by each of Testator and disposing either of their separate properties or of their joint property. It is in effect two or more wills; it operates on the death of each testator as his will disposing of his own separate property on the death of the first to die; it is admitted to probate as his own will and on the death of the survivor, if no fresh will has been made, it is admitted to probate on trhe disposition of the property of the survivor.

Wills are mutual when the Testators confer upon each other reciprocal benefits and there may be absolute benefits in each others property or they may be life interest with the same ultimate disposition of each estate on the death of the survivor.

ఇద్దరుగాని అంతకంటె ఎక్కువ ఆసామీలు ఒకే వీలునామా వ్రాస్తే దాన్ని జాయింటు వీలునామా అంటారు. సదరు వీలునామా ద్వారా ఆయా ఆసామీలు తమ జాయింటు ఆస్తినిగాని లేదా ప్రత్యేకమైన ఆస్తిని గాని ఆ వీలునామా ద్వారా ఇతరులకు చెందజేయవచ్చును. నిజానికి అవి వేరు వేరు వీలునామాలే. - కాని ఒకే డాక్యుమెంటు క్రింద వ్రాయబడినవి. ఆయా ఆసామీలలో ఎవరు ముందుగా మరణిస్తే వానికి సంబంధించిన జాయింటు ఆస్తిగాని, ప్రత్యేక ఆస్తిగాని ఆ వీలునామాలో చెప్పబడిన ప్రకారం సంక్రమిస్తుంది. ఆ వీలునామా ద్వారా probate ను కూడా పొందవచ్చును. అప్పటికి జీవించియున్న ఆసామీ మరియొక వీలునామా ఏదియు వ్రాయని యెడల - ఆ ఆసామీ మరణానంతరం ఆ జాయింటు

వీలునామాలో వ్రాయబడిన ప్రకారమే ఆస్తులు సంక్రమిస్తాయి. probate కూడా పొందవీలగును.

పరస్పరం లబ్ధిపొందుటకు ఉద్దేశించబడిన వీలునామను mutual will అంటారు. ఇందు ఇరువురు ఆసామీలు తరువాతి వారికి తమ ఆస్తిని సంక్రమింపజేయుటయే ఇందలి ముఖ్యాంశము. ఇరువురును ఒకరికొకరు legatee కూడా అగుదురు. వీటినే reciprocal wills అని కూడా అంటారు.

# 25వ అధ్యాయం

## వీలునామా వ్రాయుటకు అర్హతలు

వ్యవహార జ్ఞానము కలిగియుండి మైనరు కాకుండ ఉన్న ఏ వ్యక్తి అయిన తన ఆస్తిని వీలునామా ద్వారా ఇతరులకు సంక్రమింపజేయవచ్చును.

తన జీవితకాలములో తన ఆస్తిని అన్యాక్రాంతము చేయుటకు అర్హత గల ఏ వివాహిత స్త్రీ అయినా తన ఆస్తిని వీలునామా వ్రాయడం ద్వారా ఇతరులకు సంక్రమింపజేయవచ్చును.

తాము జరిగించుచున్న వ్యవహారము యొక్క స్వభావము తెలిసికొను జ్ఞానము కలిగియున్న, మూగ, చెవిటి, గ్రుడ్డివారు కూడా తమ ఆస్తిని వీలునామా ద్వారా సంక్రమింపజేయవచ్చును.

ఉన్మాది (Insane person) కూడా వ్యవహార జ్ఞానం కలిగియున్న సమయాలలో వీలునామా వ్రాయవచ్చును.

అయితే మత్తు పదార్థం సేవించుట వలన కాని, రోగ పీడుతుడగుటచే గాని లేదా ఏ ఇతర కారణముచేత గాని తానేమి చేయుచున్నది తెలిసికొనలేని స్థితిలో ఉన్న ఆసామీ ఆయా సందర్భాలలో వీలునామా వ్రాయుటకు వీలులేదు. (see section 59 of Indian succession Act.)

సారాంశమేమనగా మెజారిటీ వచ్చిన ఆసామీలు తమ ఆస్తులను వీలునామా వ్రాయడం ద్వారా ఇతరులకు సంక్రమింపజేయవచ్చును. మూగ, చెవిటి, గ్రుడ్డి, ఉన్మాదులు, రోగ పీడితులు కూడా వ్యవహార జ్ఞానం కలిగి ఉంటే మైనర్లు కాకుండా ఉంటే వీలునామా వ్రాయవచ్చును.

## రోగగ్రస్తుల వీలునామాల గురించి కొన్ని తీర్పులు:

1. రాజేంద్రనాథ్ Vs. జోగేంద్రనాథ్ (14 MIA. 67 at page 84 (p.c)

కేసులో వీలునామా వ్రాసిన తేదీనే Testator చనిపోయినాడు. వీలునామా చెల్లుబాటును గురించి తలయెత్తిన కేసులో వీలునామా వ్రాసిన ఆసామీ ఒకటి రెండు రోజుల పూర్వమే వీలునామా గురించి చర్చించినట్లున్ను, వ్రాసిన తేదీన తన సంతకములోని అక్షరం వ్రాసినట్లు సాక్ష్యం వచ్చినందున వీలునామా చెల్లుబాటు అవుతుందని ప్రీవీకౌన్సిల్ తీర్పు చెప్పినది.

తీవ్రమైన అస్వస్థత ఉన్నను Testator కు వ్యవహార జ్ఞానం ఉంటే వీలునామా చెల్లుబాటు అవుతుందని పైన వ్రాయబడిన తీర్పులో పేర్కొన్నారు.

2. పక్షవాతం రోగంతో బాధపడుతున్నా వ్యవహారజ్ఞానం ఉంటే ఆ ఆసామీ వ్రాసిన వీలునామా చెల్లుతుంది. (నిర్మల్ చందర్ కేసు IIR 25 Calcutta page 911).

3. తీవ్రమైన ప్లేగు వ్యాధితో బాధపడుచున్న ఆసామీ వ్రాయించిన వీలునామా చెల్లనేరదు. (కవాటి case 36 I.C.985.).

4. వార్ధక్యము, నిస్సహాయత, శరీరకృశత్వము కలిగి మంచం పట్టిన ఆసామీ అయినా వ్యవహార జ్ఞానం కలిగి ఉంటే అట్టి ఆసామీ వ్రాయించిన వీలునామా చెల్లుబాటు అవుతుంది. AIR 1941 Patna page 151 చూచునది.

5. త్రాగుబోతు అయినా మత్తు పదార్థం యొక్క ప్రభావం అతడిపై లేని సమయంలో వ్రాయించిన వీలునామా చెల్లుబాటు అవుతుంది. సురేంద్రక్రిష్ణ Vs. రాణిదాసి - ILR 41 Cal. 1043.

# 26వ అధ్యాయం

## మోసం చేసి, బలవంతపెట్టి, పలుకుబడిని దుర్వినియోగపరచి వ్రాయించుకున్న వీలునామాలు చెల్లుతాయా?

మోసం చేసిగాని, బలవంతంపెట్టి గాని పలుకుబడిని దుర్వినియోగ పరచిగాని వ్రాయించిన వీలునామా అంతయు గాని ఏదో కొంత భాగము గాని చెల్లుబాటు కాకపోవచ్చును. (section 61 of I.S.Act చూచునది).

వీలునామాకు ముఖ్యాంశము Testator యొక్క స్వతంత్రమనోభావము - బుద్ధి కుశలత - వ్యవహార జ్ఞానము. ఈ లక్షణాలను మరుగుపరచి వ్రాయించుకున్న వీలునామాలు చెల్లవని తీర్పులీయబడినవి.

మోసగించి వీలునామాలో ఒక భాగమును చొప్పించినట్లు రుజువయినందున ఆ భాగం చెల్లనేరదనియు మిగిలినదంత చెల్లుబాటు అవుతుందని ప్రీవీ కౌన్సిలు తీర్పు ఇచ్చినది. AIR 1929 PC page 45 at 50 చూచునది.

వీలునామా వ్రాయు ఆసామీని (Testator) ప్రార్థించవచ్చును. తనకు లాభించే విధముగ వీలునామా వ్రాయమని అభ్యర్థించవచ్చును. అంతేగాని, మోసగించుట బలవంతము చేయుట, undue influence ఉపయోగించుట మొదలైన అక్రమ మార్గాలద్వారా వ్రాయించుకున్న వీలునామాలు చెల్లవు. ఈ సందర్భములో సుప్రీంకోర్టు నరేష్ చంద్రదాస్ గుప్తకేసులో వెలిబుచ్చిన అభిప్రాయం గమనార్హం - సుప్రీంకోర్టు తీర్పు AIR 1955 Sc 383 ఈ తీర్పులో ప్రీవీకౌన్సిల్ వారి అభిప్రాయాలను కూడా ఆమోదించినారు. (Hall V Hall).

" In a word, a testator may be led but not driven; and his will must be the offspring of his own volition and not the record of some one else's".

5. అస్వాభావికమైన వీలునామాలు (unnatural wills) కూడా చెల్లుబాటు అవుతాయి.

వీలునామా వ్రాసిన ఆసామీ తన కుమార్లకు వీలునామా ద్వారా ఏమియు ఈయకపోయినను వీలునామా సక్రమంగా ఉంటే దానిని అమలు పరచవలసిందే. ఎంత మంది ఆసామీలు తమకుమాళ్ళు దగ్గర బంధువులతో విభేదాలు పెట్టుకున్న వారు లేరు గనుక - ఆ భేద దృష్టులన్ని ఆ తండ్రి కొడుకులవే గాని కోర్టుకు సంబంధం లేదు.

# 27 వ అధ్యాయం

## వీలునామా ఏభాషలో ఉండాలి? దేనిపై వ్రాయాలి?

వీలునామా ఏ భాషలోనైనా వ్రాయవచ్చు. రాజ్యాంగ చట్టంలో గుర్తింపు పొందిన భాషలు అనుబంధంలో ఈయబడినవి. వాటిలో ఏ భాషైనా కావచ్చు. ఆంధ్ర ప్రదేశ్‌లో తెలుగు, ఇంగ్లీషు, హింది, ఉర్దూ భాషలు వాడుకలో ఉన్నవి. Testator యొక్క మాతృభాష ఏదైతే ఆ భాషలో వ్రాస్తే అభిప్రాయం వ్యక్తం చెయ్యడం సులువు అవుతుంది. ప్రపంచంలో ఇంగ్లీషు భాష చాలా దేశాల్లో చోటు చేసుకుంది. మన ఉన్నత విద్య ఉన్నత న్యాయస్థానాలు ఇంగ్లీషు భాషనే ఉపయోగిస్తున్నాయి. గవర్నమెంటు కార్యకలాపాలు, వ్యవహారాలు, గజెటులు ఇంగ్లీషుభాషలో సాగుతున్నాయి. వీలునామాను సహజంగా కాగితంపై వ్రాయుచుందురు. తాటియాకులపైన వ్రాసినా చెల్లుబాటు అవుతుంది. అయితే విజ్ఞానం విస్తరించిన ఈ రోజులలో తెల్లటి దళసరి కాగితములపై విడివిడి పంక్తులుగా వీలునామా వ్రాయుట అభిలషించదగినది. సమయానుకూలంగా ఏ కాగితంపైన వ్రాసినను వ్రాయవచ్చును. తెల్లటి కాగితంపై ఒకవైపే వ్రాస్తే రిజిస్ట్రేషను చేయించుటకు సులువుగా ఉంటుందని తెలుసుకోవాలి.

# 28 వ అధ్యాయం

## వీలునామా వ్రాయబడిన స్థలం - తేది సమయం:

వీలునామా ప్రారంభంలోనే సంవత్సరం నెల-తేది వ్రాయడం మంచిది. వీలునామా వ్రాసే ఆసామీ ఏఊరు నివాసి, ఏ ఊరిలో నివసిస్తూ వీలునామా వ్రాయుచున్నాడో మొదటి పేరాలో వ్రాయడం చాలా ఉపయోగం. క్రిస్టియన్ శకం - ఇంగ్లీషు నెలలు తేదీలు వాడుట చాలా సులువు. వీటినే గ్రెగోరియన్ Calendar అంటారు. తెలుగు సంవత్సరం నెల వారం వ్రాసినా వీలునామా చెల్లుబాటు అవుతుంది. సంవత్సరం-నెల-తేది- ఏదీ వ్రాయక పోతే ఏ సంవత్సరంలో ఏ నెల-తేదీలలో వ్రాయబడినదో నిర్ధారణ చేయుటకు వాగ్రూపమైన సాక్ష్యం తీసుకోవచ్చును. ఏదేని తేదీ పొరబాటుగా వ్రాయబడితే దానిని సరిదిద్దుటకు వాగ్రూపమైన సాక్ష్యం తీసుకోవచ్చును.

కోడిసిల్ చెల్లుబాటు అవాలంటే వీలునామా మాదిరిగనే వ్రాయబడి సాక్షులచే సంతకములు చేయించవలసియున్నది.

# 29 వ అధ్యాయం

## వీలునామాలను ఋజువు పరచుట

వీలునామాను ఋజువు చేయు భారము (Burden of Proof) దాని ద్వారా లబ్ధి పొందుటకు దాఖలు చేసిన ఆసామీ (Propounder) దే అయి యున్నది. ఇతర దస్తావేజులను, ఇతర డాక్యుమెంట్లను ఏవిధముగ ఋజువు చేయవలసియున్నదో వీలునామా కూడా అదే విధముగ ఋజువు పరచవలసి యున్నది. అయితే వీలునామా ఋజువు పరచుటకు మరికొన్ని అదనపు బాధ్యతలు కూడా ఉన్నవి. వీలునామాలోని సాక్షి సంతకములు (Attestation) మరియు వీలునామా వ్రాసినపుడు వ్రాయించిన ఆసామీ (Testator) యొక్క ఆరోగ్య పరిస్థితి, వ్యవహార జ్ఞానము-తానేమి చేయుచున్నది తెలిసికొను జ్ఞానము కూడా ఋజువు చేయవలసి యున్నది.

వీలునామా రిజిష్టరీ కాబడిన యెడల అది సక్రమముగ వ్రాయబడినదేనని దాని నిజాయితీని నిరూపించుట చాల సులభము. వీలునామా యొక్క యధార్థస్థితి (genuineness) పై కలిగెడి అనుమానాలు, అపోహలను తొలగించవచ్చును. రిజిష్టరీ చేయు అధికారి వీలునామా వ్రాసినతనికి దానిని చదివి వినిపించి తానేమి చేయుచున్నది తన ఆస్తులను ఏ విధముగ సంక్రమింప జేసినది తెలియ జెప్పడం దానికి Testator ఒప్పుకున్నట్లు ఋజువైతే వీలునామా పై కలిగెడి అనుమానాలను అపోహలను తొలగించవచ్చును. అయితే రిజిష్టరీ కాబడిన వీలునామాలు కూడా చెల్లుబాటు కాకుండా పోయిన సందర్భాలు ఎన్నో ఉన్నవి. రిజిష్టరీ చేయు అధికారి Testator ని చూడక పోయినను, వీలునామా చదివి వినిపించక పోయినను Testator ఏమి చేయుచున్నది తనకు తెలియని పరిస్థితిలో రిజిష్టరీ కాబడినను అట్టి వీలునామా చెల్లక పోవచ్చును. రాణి పూర్ణిమా దేవి Vs. ఖగేంద్ర నాయాయణదేవి AIR 1962 S.C. పేజి 567 చూచునది.

గిరిజా దత్త సింగ్ Vs. గంగోత్రి దత్తసింగ్ AIR 1965 Sc. 346 చూచునది. ఈ సందర్భమున AIR 1982 ఢిల్లీ పేజి 584 at page 586 చూడదగినది.

వీలునామాను ఋజువు చేయుటలో disinterested, satisfactory and sufficient evidence adduce చేయుటయే గాక మరికొన్ని విషయములను కూడా ఋజువు పరచుట శ్రేయస్కరము. అవేవనగా: వీలునామా వ్రాసినతని వ్యవహార జ్ఞానము సాక్షుల యొక్క నిజాయితీ, వీలునామా ద్వారా ఆస్థిని సంక్రమింప జేయదలచిన ఆసామీల సహజ బంధుత్వము లేదా సన్నిహితత్వము కూడా ఋజువు పరచుటలో సహకరించగలదు.

వీలునామాపై Testator యదార్థముగ వ్యవహార జ్ఞానంతో సంతకం చేసినట్లు గాని లేదా వేలిముద్ర వేసినట్లు గాని ఋజువు కాబడి సాక్షి సంతకములు attestation కూడా ఋజువైతే లేనిపోని అపోహలకు తావీయకుండ ఆ వీలునామా చెల్లుబాటు అవుతుందని కోర్టులు తీర్పు చెప్పాలని కలకత్తా హైకోర్టు అభిప్రాయ పడింది.

AIR 1939 Cal. పేజి 87 చూచునది.

"A will is one of the most solemn documents known to the law.'By it a dead man entrusts to the living the carrying out of his wishes and it is impossible that he can be called either to deny his signature or to explain the circumstances in which it was executed it is essential that trustworthy and effective evidence should be given to establish compliance with the necessary form of law.

Ram Gopal Vs. Apina Kunwar AIR 1922 PC. 366 at Page 369.

ప్రివీ కౌన్సిలువారు వీలునామా ఋజువు చేయు విధానము గురించి వెలిబుచ్చిన అభిప్రాయము పైన వ్రాయబడినది.

జ్ఞాన ప్రకాశం పిళ్ళై Vs పరాశక్తి అమ్మాళ్ AIR 1941 Madras 178 పై తీర్పు కూడా చూచునది.

వీలునామా చెల్లుబాటు అగుటకు ఋజువు చేయవలసిన ముఖ్యాంశాలు. ఇండియన్ వారసత్వ చట్టం Section 63 ప్రకారం; వీలునామా వ్రాసినతడు (Testator) ఆ వీలునామా పై సంతకం చేయవలెను లేదా వేలిముద్ర వేయవలెను. లేదా ఆ Testator సమక్షంలో ఆ Testator యొక్క ఆదేశంపై (direction) మరియొక ఆసామీ సంతకం చేయుట గాని వేలిముద్ర వేయుట గాని జరిగించ వలెను.

వీలునామా ఇద్దరు లేదా అంతకంటె ఎక్కువమంది వ్యక్తులచే సాక్షి సంతకముల చేయబడవలెను. అట్లు సాక్షి సంతకం చేసిన ప్రతి సాక్షియు Testator సంతకం చేయుటయో లేదా వేలిముద్ర వేయుటయో చూచియున్న వారై యుండవలెను. Testator యొక్క direction పై సంతకం చేయబడిన లేదా వేలి ముద్ర వేయబడిన వీలునామా పత్రం కూడా పైవిధముగనే సాక్షి సంతకములు చేయబడవలెను. లేదా Testator తాను వీలునామాపై సంతకం చేసినట్లు చెప్పి ఒప్పుకుని సాక్షులచే సంతకం చేయించవచ్చును. అయితే వీలునామాపై సంతకం చేయుట లేదా వేలిముద్ర వేయు సమయంలో ఒకరికి మించిన సాక్షులు హాజరుగా ఉండాలనే నియమం లేదు. అంతేకాక సాక్షి సంతకాలకు ఏదేని నిర్ణీతమైన విధానం కూడా లేదు.

సాక్షికి ఆస్థి యిచ్చుట: వీలునామాలో సాక్షి వ్రాలు చేసిన వానికి (Attestator) ఆ వీలునామా ద్వారా ఏదైనా కొంత ఆస్తి సంక్రమింప జేసిన వాని సాక్ష్యం చెల్లక పోదు.

వీలునామాలో Executor గా పేర్కొన బడిన ఆసామీ సాక్షివ్రాలు చేసినా ఆ వీలునామా చెల్లక పోదు.

వీలునామాలో తుడుపులు - హంసపాదులు - కొట్టి వేతలుంటే అది చెల్లుతుందా?

వీలునామాలో తుడుపులు - కొట్టివేతలు - హంసపాదులు ఉన్నా వాటి ప్రక్కనో చివరనో మార్జిన్‌లో గల కాళీలోనో Testator చేవ్రాలు చేసిన యెడల - సాక్షులు కూడా వాటి దిగువను సంతకములు చేసిన యెడల ఆ వీలునామా చెల్లుబాటు అవుతుంది.

(Section 71 of Indian Succession Act)

వీలునామాలో ఉపయోగించే పదజాలం:

వీలునామా Testator యొక్క అభిప్రాయాన్ని వ్యక్తం చేసే పదజాలం ఉంటే చాలు. ప్రత్యేకమైన మాటలు Technical Terms ఏవియు వాడనవసరంలేదు.

ఏదైనా వాక్యంలో ఆ వాక్యం యొక్క అర్థమును పూర్తిగా తెలియ జేయు పదంగాని మాటగాని వ్రాయబడక పోతే దానిని సందర్భాను సారముగ పూరించ వచ్చును. (See Section 77)

# 30 వ అధ్యాయం

## వీలునామా చెల్లుబాటు అగుటకు అనుకూలమైన సందర్భాలు

సాధారణముగ రిజిస్టరీ కాబడిన వీలునామాలు చెల్లదగినవే అనుటకు ఎక్కువ అవకాశములున్నవి. వీలునామా లేఖరి - కొన్ని సందర్భాలలో రిజస్టరీ చేయు అధికారి కూడా సాక్షులుగా ఉపయోగ పడుదురు.

అటులనే Testator చే deposit చేయబడిన వీలునామా విషయంలో కూడా అనుమానాలకు అపోహలకు చాలా తక్కువ అవకాశాలుంటాయి. వీలునామా ఋజువు చేయు విషయములో సుప్రీంకోర్టు యిచ్చిన తీర్పులు గమనార్హం.

1. H. వెంకటాచల అయ్యంగారు, Vs.తిమ్మాజమ్మ. AIR 1959 Sc.పేజి 443.

2. పూర్ణిమ దేవి Vs. ఖగేంద్రనారాయణ్ AIR 1962 Sc. పేజి 567.

అనుమానాలకు అతీతంగా ఉన్న సందర్భాలలో వీలునామా వ్రాసినతడి (Testator) అర్హత (Capacity) - Testator యొక్క సంతకం - లేదా వేలిముద్ర Attestator యొక్క సంతకాలు ఋజువు చేస్తే వీలునామా చెల్లుబాటు అవుతుంది.

వీలునామా రిజిస్టరీ చేయించకపోయినంత మాత్రాన దాని చెల్లుబాటుకు హాని కలుగదు. Testator కు తాను వ్రాసిన వీలునామా బహిరంగము చేయుట ఇష్టం లేక రిజిస్టరీ చేయించుట మాని వేయవచ్చును. రిజిస్టరీ చేయించక సుమారు 20 సంవత్సరములు అటులనే ఉంచినను, సంతకం చేయగలిగియు వేలిముద్ర వేసినను ఒకే సాక్షి వ్రాలు చేయించినను, వీలునామా ద్వారా సంక్రమింప జేసిన ఆస్తులు అబ్బిదారుల విషయంలో అస్వాభావికంగా తోచినను Testator యొక్క అనారోగ్య పరిస్థితులు ఇవి అపోహలకు దారితీయును. అట్టి సందర్భాలలో వీలునామా చెల్లకనే పోవచ్చును. ఈ క్రింది కేసులులో ఈయబడిన తీర్పులు గమనించదగినవి.

(1) Brijbala Vs. Nityamayee AIR 1934 Calcutta Page 17 at 20.

(2) రాంగోపాల్ Vs. అపిన కున్వర్ AIR 1922 P.C.366.

(3) Gajagopala Vs. Mangala (1911) 2 M.W.N. 42.

వీలునామా అంతయు Testator స్వదస్తూరీతోటే ఉంటే, Attestors చే సంతకాలు చేయబడియుంటే రిజిస్టరీ కాకపోయినను ఆ వీలునామా చెల్లుబాటు అవుతుంది.

Testator యొక్క సంతకం Shaky (వణుకు) గా ఉన్నా Uncharacterstic కాకపోతే వీలునామా చెల్లుబాటు అవుతుందని P.C. తీర్పు చెప్పింది.

P.Sankara Reddy Vs. P. Mahalakshmamma AIR 1922 P.C. పేజి 315.

వీలునామాలో సాక్షి సంతకములు చేసిన వారు High Status కలిగియుండి Testator సంతకాన్ని ధృవ పరిస్తే Testator యొక్క ఆరోగ్య పరిస్థితిపై వచ్చిన Medical Report వ్యతిరేకంగా ఉన్నా వీలునామా చెల్లుబాటు అవుతుంది. See AIR 1923 Calcutta Page 116.

## వీలునామాలో చివరను వ్రాయవలసిన ముఖ్యాంశాలు:

వీలునామా వ్రాసిన ఆసామీ Testator అదియే తన ఆఖరి వీలునామా అయి యున్నదని వ్రాయాలి.

సదరు వీలునామాను తన జీవిత కాలంలో రద్దు చేయుటకు మార్పు చేసికొనుటకు హక్కు తన యందుంచు కొన్నట్లు కూడా వ్రాయాలి.

సదరు వీలునామాను మంచి తెలివితోను వ్యవహార జ్ఞానంతోను వ్రాయించినట్లు కూడా అందులో వ్రాయుట మంచిది.

# 31 వ అధ్యాయం

## వీలునామా (Will) ఎప్పటి నుండి అమలులోనికి వస్తుంది?

వీలునామా వ్రాసిన వ్యక్తి Testator మరణించిన మరుక్షణం నుంచి వీలునామా అమలులోనికి వస్తుంది. Indian succession Act (Act 39 of 1925) Section 2(h) లో Will అంటే నిర్వచనం ఈయబడింది. దానిని బట్టి Testator యొక్క మరణానంతరం ఆ వ్యక్తి వ్రాసిన వీలునామా అమలు లోనికి వస్తుంది.

## వీలునామా ద్వారా గార్డియన్ నియామకం

మైనరు అయిన తన శిశువు (Child) కు తండ్రి తన వీలునామా ద్వారా గార్డియన్‌ని గాని గార్డియన్లను గాని నియమించ వచ్చును. ఇక్కడ తండ్రి వయసుతో నిమిత్తం లేదు. See Section 60 of Indian Succession Act..

# 32 వ అధ్యాయం

## వీలునామా ద్వారా సంక్రమింప జేయు ఆస్తి హక్కులపై హిందు దత్త స్వీకార మనోవర్తి చట్టముల ప్రభావం. Act 78 of 1956.

వీలునామా వ్రాయడం ద్వారా తన భార్యకు కుమారుని దత్తత చేసికొను అధికారము సంక్రమింప జేయుచుండెడి వారు. హిందు దత్త స్వీకార మనోవర్తి చట్టము అమలులోనికి వచ్చిన దగ్గర నుండి సదరు చట్టములోని **4,5** సెక్షన్లను అనుసరించి మరియు సదరు చట్టములోని 8వ సెక్షనులో చెప్పబడిన అర్హత గల స్త్రీలు కుమారుని గాని - కుమార్తెను గాని దత్తత చేసికొనవచ్చును. అందుచే వీలునామా ద్వారా హక్కు సంక్రమింప జేయ వలసిన అగత్యము లేదు.

## హిందూ స్త్రీలకు వీలునామా వ్రాయు అధికారం

మరియు హిందు వారసత్వ చట్టం ప్రకారం ఏ మహిళ అయిన తనకు సంక్రమించిన లేదా తనకు విక్రయించుటకు మొదలగు అన్యాక్రాంతములు చేయుటకు అధికారము గల ఆస్తిని వీలునామా వ్రాయుట ద్వారా తన ఇష్టం వచ్చిన వారికి సంక్రమింప జేయవచ్చును.

హిందు వారసత్వ చట్టం సెక్షను **14(1)** ద్వారా ఆమె స్వాధీన మందుగల ఆస్తుల పై ఆమెకు సర్వహక్కులు (absolute rights) ఈయబడినవని గుర్తించ వలసి యున్నది.

అందుచే మైనరుకానటువంటిన్ని వ్యవహార జ్ఞానం కలిగి యున్న ఏ హిందు స్త్రీ అయినా తనకు అన్యాక్రాంతము చేయు హక్కుగల ఆస్థిని వీలునామా ద్వారా ఇతరులకు సంక్రమింపజేయవచ్చును.

# 33 వ అధ్యాయం

## వీలునామాలో లేని అంశములను ఋజువు చేయవచ్చునా? (Parol Evidence)

ఏదేని వీలునామాలో Testator ఈయదలచిన ఆస్తుల గురించి లబ్దిదారుల ఆసామీల వివరాలను గురించి వివరాలు పూర్తిగా లేక పోయినా, నిర్దుష్టంగా వ్రాయకపోయినా (deficiencies supplied and inaccuracies corrected) వాటిని ఇతర సాక్ష్యాధారాలతో Testator యొక్క అభీష్టాన్ని నెరవేర్చే నిమిత్తం భర్తీ చేయవచ్చును.

వీలునామాలో వాడిన భాషగాని అందలి Technical Terms గాని కోర్టుకు అవగాహన కాకపోతే వాటి ఋజువు నిమిత్తం వాటిని తర్జుమా చేయించవచ్చును. (Translation) (Extrinsic evidence admissible section 80)

ఈ సందర్భమున Parrey Lal Vs. Rames war Das AIR 1963 S.C. పేజి 1703 చూచునది.

లబ్దిదారు (Legatee) యొక్క పేరు పొరబాటుగా వ్రాయబడితే దానిని సవరణ చేయుటకు Parol Evidence ఉపయోగించవచ్చును. (Indian succession Act Section 76(2) చూచునది.

పేరుచెప్పి సదరు ఆసామీ దత్త పుత్రుడు అని వివరణ యిస్తే సదరు లబ్దిదారు Testator చే పేర్కొనబడిన ఆసామీగా Persona Designata వీలునామాలో ఈయబడిన ఆస్తిని పొందుటకు అర్హుడగును.

# 34 వ అధ్యాయం

## పిఠాపురం కేసు: Persona Designata

పిఠాపురం రాజావారు వీలునామా వ్రాయించి ఒక పేరుగల ఆసామీకి తన ఆస్తిని దఖలు పరుస్తూ సదరు ఆసామీ ఔరస పుత్రుడు అని వివరణ చేర్చినారు. కాని తదనంతరం సదరు ఆసామీ (Legatee) రాజా వారి ఔరస పుత్రుడు కాడని ఋజువయింది. అయితే వీలునామా వ్రాసిన Testator యొక్క అభిప్రాయం తాను వీలునామాలో వ్రాసిన పేరుగల ఆసామీకి ఆస్తి చెంద జెయ్యాలన్నదే ముఖ్యము గనుక సదరు Legatee వీలునామాలో వ్రాయబడిన ఆస్తి పేరుగల వ్యక్తిగా (Persona Designata) తీసికొనుటకు అర్హుడని ప్రీవీ కౌన్సిలు తీర్పు చెప్పినది. వెంకట సూర్య Vs. Court of Wards ILR 22 Madras Page 383 at 391 (P.C.) కావున Testator యొక్క అభిప్రాయ సేకరణకు మాత్రం Parol Evidence తీసికొనవచ్చును.

## హోదా (బంధుత్వం) కలిగితే ఆస్తి:

అయితే ఒక ఆసామీ తన వీలునామా ద్వారా తన మేనల్లునికి తన కుమార్తెనిచ్చి పెండ్లి చెయుదును గనుక వారి అనుభవం నిమిత్తం కొంత ఆస్తిని సంక్రమింప జేసెను. వీలునామా అనంతరం Testator మరణించెను. పెండ్లి చేసికొనకుండానే Testator మేనల్లుడు తరువాత మరణించెను. Testator యొక్క ముఖ్యోద్దేశము తన కుమార్తెను మేనల్లునికిచ్చి పెండ్లి చేయుట గనుక అది జరుగలేదు గనుక మేనల్లునికి వీలునామా ద్వారా ఆస్తి సంక్రమించ లేదని Madras High Court తీర్పు చెప్పినది.

రామమ్మ Vs. వెంకట లక్ష్మమ్మ AIR 1941 Madras 375 at 376 చూచునది.

## ఆస్తి వివరణలో పొరపాట్లు దొర్లితే వాటిని సవరించవచ్చును.

ఒక ఆసామీ స్థిరాస్తిని ఒక లబ్ది దారుకు ఇస్తూ తన వెండి - బంగారం - నగదు మరి కొంత మందికి చెందజేయవలెనని వ్రాస్తూ వాటిని "అచల" ఆస్తి అని పేర్కొనినాడు. అచల అనగా స్థిరాస్తి కదా. స్థిరాస్తి ఇదివరకటి పేరాలలో ఇచ్చి వేసినాడు గనుక "చర" అనుటకు బదులుగా "అచల" అని పొరబాటున వ్రాయించినాడనియు దానిని సవరణ చేయవచ్చుననియు సుప్రీం కోర్టు అభిప్రాయ పడినది.

ప్రమోద్ కుమారి భాటియ Vs. ఓమ్ ప్రకాష్ భాటియ AIR 1980 S.C. Page 446 చూచునది.

# 35 వ అధ్యాయం

## వీలునామా ద్వారా సంక్రమింప జేయదగు ఆస్తులు:
## హిందూ జాయింటు కుటుంబంలో వాటా వగైరా:

వీలునామా వ్రాయు ఆసామీ (Testator) కి హక్కుగల (Ownership) చరస్థిరాస్తులు తాను అన్యాక్రాంతము చేయుటకు హక్కుగల ఆస్తులను వీలునామా ద్వారా ఇతరులకు సంక్రమింప జేయవచ్చును.

ఏ హిందువు అయినా తాను అన్యాక్రాంతము చేయుటకు హక్కుగల ఆస్తిని వీలునామా ద్వారా ఇతరులకు చెందజేయ వచ్చునని 1956లో వచ్చిన హిందు వారసత్వ చట్టం స్పష్టం చేసినది. అదే చట్టంలో "Interest" of a Male Hindu in a Hindu Mitakshara coparcenary property వీలునామా ద్వారా చెంద జేయదగు "ఆస్తి" గా పరిగణించ వలెనని రూఢి చేసినది. అనగా హిందు మితాక్షర అవిభక్త కుటుంబములోని సభ్యులకు నియమితమైన నిర్ణీతమైన వాటా అంటూ ఉండదు. ఆ సభ్యునికి సదరాస్తిలో గల హక్కును "Interest" అని పిలుస్తారు. అట్టి Interest కుటుంబములోని coparceners సంఖ్య పెరిగితే తగ్గుతూ ఉంటుంది. కుటుంబములోని coparceners యొక్క సంఖ్య తగ్గితే Interest పెరుగుతూ ఉంటుంది. సదరాస్తిని విభజించుకునే వరకు ఇటులనే ఉంటుంది. ఇక మితాక్షర హిందు coparcenary కుటుంబములో A-B-C అను ముగ్గురు సభ్యులున్నారనుకుంటే వారి కుటుంబమునకు గల ఆస్తియందు ఒక్కొక్కరికి గల Interest "D" అనే సభ్యుడు జననం ద్వారా గాని దత్తత రీత్యాగాని చేరితే తగ్గిపోతుంది. A-B-C అనే ముగ్గురిలో ఏ ఒకరైనా మరణిస్తే మిగిలిన వారి Interest పెరుగుతుంది. పంపకం జరిగేవరకు దానిని "Interest" అని మాత్రమే వ్యవహరిస్తారు. Coparceners లో ఒకరు అవివాహితుడుగా చనిపోతే వాని Interest మిగిలిన సభ్యులకు "Survivorship" ద్వారా సంక్రమిస్తుంది. హిందూ వారసత్వ చట్టం 1956 అమలులోనికి రాక పూర్వం సదరు సభ్యుని యొక్క

"Interest" ను వీలునామా ద్వారా ఇతరులకు సంక్రమింప జేయుటకు వీలు లేకుండెడిది. హిందు వారసత్వ చట్టం ఆ ఆటంకాన్ని తొలగించింది. ఇప్పుడు హిందు మితాక్షర coparcenary కుటుంబ సభ్యుడు సదరు కుటుంబాస్తులలో తనకు గల "Interest" ను ధారాళంగా వీలు నామా ద్వారా సంక్రమింప జేయవచ్చును. ఇటువంటి అవకాశమునే తార్వాడే, తవాజి, ఇల్లోమే (Illom) కుటుంబ లేక కవరు శాఖలకు చెందిన హిందు సభ్యులకు కూడా సంక్రమింప జేసినారు.

# 36 వ అధ్యాయం

## మితాక్షర అంటే ఏమిటి?

యాజ్ఞవల్క్య మహర్షి ఒక స్మృతిని వ్రాసేరు. దానిపేరు యాజ్ఞ వల్క్య స్మృతే దానికి విజ్ఞానేశ్వర యోగి వ్యాఖ్యానం వ్రాసి దానికి "మితాక్షర" అని పేరు పెట్టేరు. దానినే విజ్ఞానేశ్వరీయం అని కూడా అంటారు. అయితే హిందు కుటుంబాలలో ఆసేతు హిమాచల పర్యంతం ఒక్క వంగ దేశం (West Bengal) మినహా అన్ని రాష్ట్రాలలోను వారసత్వ హక్కుల నిర్ణయం మితాక్షర వ్యాఖ్యానాన్ని బట్టే జరుగుతూ ఉండేది. మితాక్షర వ్యాఖ్యానాన్ని ప్రీవీ కౌన్సిలు వారు కూడా ఎంతగానో కొనియాడేరు. బ్రిటిష్ పరిపాలనలో కొన్ని మార్పులు ఇండియాకు స్వతంత్రం వచ్చేక మరికొన్ని మార్పులతో చట్టాలు వెలువడినవి.

# 37 వ అధ్యాయం

## చట్టబద్ధమైన హిందూ"లా"

1. హిందు వారసత్వ చట్టం Act 30 of 1956.

2. హిందు వివాహాల చట్టం Act 25 of 1955.

3. హిందు దత్త స్వీకార మనోవర్తుల చట్టం Act 78 of 1956.

4. హిందు మైనారిటీ గార్డియన్‌షిప్పుల చట్టం. Act 32 of 1956.

అయితే చట్టబద్ధం చేయబడని అంశములకు ఇంకను మితాక్షర వర్తిస్తుంది. "Survivorship" ను తొలగించలేదు. దానికి ఇంకను మితాక్షరయే ఆధారము.

అయితే వంగదేశములో (West Bengal) "దాయభాగ" లా వర్తిస్తుంది. దీనిని తొలిసారిగా ప్రవేశపెట్టినవారు "జీమూత వాహనుడు" (వీటి వివరములకు ఈ రచయితల చే తెలుగులో వ్రాయబడిన "హిందు-లా చూచునది).

# 38 వ అధ్యాయం

## హిందు స్త్రీలు - వీలునామా

తనకు హక్కుగల ఆస్తిని హిందు స్త్రీ ఇతర Conditions కు లోబడివీలునామా వ్రాయడం ద్వారా ఇతరులకు సంక్రమింప జేయవచ్చును.

ఇతర Conditions అనగా Indian succession Act లో చెప్పబడిన ప్రకారం ఆమె మైనరు అయి యుండరాదు. వ్యవహార జ్ఞానం కలిగి యుండాలి.

సాధారణముగ వీలునామా ద్వారా ఈ క్రింద చెప్పబడిన ఆస్తులు ఇతరులకు చెందజేయవచ్చును.

A) ఇళ్ళు, ఇళ్ళ స్థలాలు - అన్ని రకాలైన మెరక - పల్లం భూములు; Apartments తోటలు - మొదలగునవి, Factories.

B) చరాస్తి - కారు - బండ్లు మొదలగు వాహనాలు.

C) నగదు - Banks లో ఉన్న నిల్వలు

D) షేర్లు - షేర్లపై వచ్చు డివిడెండ్లు బోనస్.

E) అన్నిరకాలైన సెక్యూరిటీలు, పెట్టుబడులు డిబెంచర్లు.

F) బంగారు- వెండి వస్తువులు-వజ్రాలు మొదలగు విలువైన రాళ్ళు

G) షేర్లపైన Bonds పైన వచ్చు ఆదాయము

H) Furniture కర్రసామాన్లు Paintings పాత్రసామాను (Utensils) బీరువాలు కుర్చీలు, సోఫాలు

I) వ్యాపారం (Business)

J) పుస్తకాలు Manuscripts.

K) ఇళ్ళకు మొదలగు వాటికి అమర్చబడిన ఎలక్ట్రికల్ Fans, Lights మొదలగు పరికరములు.

L) ఇతర Household వస్తువులు

M) Interest in partnership including declared but undrawn profits and undeclared profits;

N) Leasehold Right So long as the lease subsists.

ఇట్టివే అయిన ఇతర చరాస్తులు కూడా వీలునామా ద్వారా చెందజేయ వచ్చునని తెలియదగును.

ఏ హిందు పురుషుడైనను తన భార్య, సంతతి వృద్ధులైన తలిదండ్రులను లేమిలో ( poverty ) వదలి తనకు గల ఆస్తులన్నిటిని ఏ ఒకవ్యక్తికైనా లేదా ధార్మిక సంస్థకైనా ఇవ్వతగదు.

హిందు దత్తతల మనోవర్తి చట్టములోని 18, 19, 20, 21, 22 సెక్షనులలో చెప్పబడినవారికి ఆయా సందర్భములను బట్టి మనోవర్తి ఈయవలసివచ్చును.

ఏ హిందు అయిన తన భార్యను విడిచిపెట్టినను, ఆమె యెడల క్రూరముగ ప్రవర్తించినను; కుష్టురోగపీడితుడైనను; లేదా మరియొక భార్యతో ఉన్నను; ఉంపుడుకత్తె(Mestress)ను తీసికొని వచ్చి భార్య ఉన్న ఇంటిలోనే కాపురం పెట్టినను; హిందూమతమును విడనాడినను మరియేయితర న్యాయమైన కారణమున్నను ఆమె తన భర్తనుండి వేరుగ కాపురం ఉంటూ తన భర్తనుండి మనోవర్తి పొందుటకు హక్కు కల్పించబడినది, మనోవర్తియనగా ఉండుటకు నివాసము; కట్టుబట్టలు ఆహారపదార్థములు వైద్యసేవలు అని తెలియనగును.

ఇతరత్ర ఆదాయములేని వితంతుకోడలు కూడా మామగారి నుండి మనోవర్తి పొందు అధికారము కలదు.

ఏ హిందు అయినను తన సంతతి అనగా అక్రమసంబధము చేతగాని,

క్రమపద్ధతి ద్వారాగాని పొందిన స్త్రీ పురుష సంతానమువారిని, వృద్ధులైన తల్లిదండ్రులను పోషించవలసిన బాధ్యత యున్నదని సెక్షను,20. తెలుపుచున్నది. కుమార్తెకు పెండ్లిచేయవలసిన బాధ్యత కూడా మనోవర్తి క్రిందకేవస్తుంది.

ఇక తనపై ఆధారపడినవారు ఎవరనగా; తండ్రి, తల్లి, తిరిగి వివాహము చేసికొనకుండ ఉన్నంతకాలము తనవితంతుభార్య; తనంతట తాను పోషించుకొను శక్తిచాలని మైనరు కుమారుడు, పితృవిహీనుడైన మనుమడు అట్టిమునిమనుమడు కూడా dependants క్రింద వచ్చెదరు. వీరందరికి ఆయా సందర్భాలను పురస్కరించుకొని మనోవర్తి ఈయవలసిన బాధ్యత ఉన్నది. అంతేకాక ఇంకను వితంతుకుమార్తె, వితంతుకోడలు, మైనరుకుమారుడు, మైనరుకుమార్తె అక్రమసంబంధముచే కలిగినవారైనా వారుకూడా మనోవర్తి పొందుటకు అర్హులు.

ఎవరికైనను ఒకనిఆస్తి వారసత్వరీత్యా సంక్రమిస్తే అట్టి ఆసామీ యొక్క dependants సదరాస్తిపైవచ్చు ఆదాయమునుండి మనోవర్తిపొందు హక్కు కలిగియున్నారు.

ఎవరైనా ఆసామీ తన ఆస్తిని వీలునామా ద్వారా మరియొకరికి సంక్రమింపజేస్తే ఆ Testator యొక్క dependants సదరాస్తినుండి మనోవర్తి పొందు హక్కుకలదు, వివరములకు Section 22 of The Hindu Adoptions & Maintanance Act చూచునది.

అందుచేత ఏ ఆసామీ అయిన తన తల్లిదండ్రులను, భార్యను, సంతతిని, వితంతుకుమార్తె, వితంతు కోడలిని, అక్రమసంబంధమువలన కలిగిన స్త్రీ పురుష సంతతిని విడిచిపెట్టి తన ఆస్తినంతటిని ఇతరులకు చెందజేయతగదనియు ఆ ప్రకారం చేసిన యెడల వీలునామాద్వారా ఇతరులకు సంక్రమింపజేసిన ఆస్తియే మనోవర్తి ఇచ్చుటకు బాధ్యత వహించుననియు తెలుసుకోవలెను.

# 39 వ అధ్యాయం

# Bequests

Bequest అనగా వీలునామా ద్వారా మరియొకరికి చెందజేయు అస్తియని అర్థము, ఇద్దరు సజీవులైన ఆసామీల మధ్య జరిగే వ్యవహారమైతే దానినిgift అంటారు, అదే వీలునామా ద్వారా అయితే దానిని Bequest అంటారు. లబ్ధిదారుని వ Legatee అని వ్యవహిరిస్తారు. gift ద్వారా పొందితే Donee అంటారు.

వీలునామా ద్వారా చెందజేయబడిన ఆస్తిని Legacy అంటారు.

వీలునామా ద్వారా చెందజేయు ఆస్తి; లబ్ధిదారు యొక్క వివరములు నిర్దుష్టంగా స్పష్టంగా లేకపోతే uncertainity ఉంటే ఆ వీలునామాగాని ఆ bequest గాని చెల్లకుండాపోతుంది (Section 80 of Indian Succession Act చూచునది).

ఏ ఆసామీ అయినా వీలునామా ద్వారా చెందజేయు ఆస్తిని వివరములు లేకుండా; నా వారసులకు (heirs) లేదా నా Right heirs కు లేదా బంధువులకు (Relations) లేదా దగ్గర బందువులకు లేదా కుటుంబమునకు లేదా Kindred or nearest of kin or next of kin అనే పదజాలం ఉపయోగించి నిర్దుష్టంగా వ్రాయకపోతే సదరు Testator వీలునామా వ్రాయనట్లే భావించి వాని ఋణములు తీర్మానముకు అవసరమగు ఆస్తిని కేటాయించి మిగతా ఆస్తిని అతడి వారసులకు పంచిపెట్టవలెను. (Section 93) అందుచే వీలునామా ద్వారా చెందజేయదలచిన ఆస్తిని ఆ అబ్ధిదారుని కూడా సాద్యమైనంత వివరముగా వ్రాయడం అవసరం అని గుర్తించాలి.

## ఆంక్షలవిధింపు:- జీవితకాలపు హక్కు

ఏదేని ఆస్తిని వీలునామా ద్వారా చెందజేస్తూ సదరాస్తి అనుభవంపై ఆంక్షలు విధించని యెడల Testator కు గలహక్కులన్నియు legatee కి సంక్రమించును (Section 95).

ఆంక్షలు అనగా ఏదైనా స్థిరాస్తిని ఒక legatee కి చెందజేస్తూ అతడు అతని జీవితకాలం మాత్రం అనుభవించాలి. దానవిక్రయాదులు చేయరాదు. అనునవి ఆంక్షలు (limitations).

## ప్రత్యామ్నాయము (Alternative Bequest)

ఎవరైనా Testator ఒక ఆస్తిని A కి గాని B కి గాని చెందవలెనని వీలునామా వ్రాస్తే - Testator చనిపోవునాటికి "A" కి చెందును, B కి చెందదు. Testator చనిపోవుటకంటె ముందుగనే "A" మరణిస్తే సదరాస్తి B కి చెందును. ఇదే ప్రత్యామ్నాయము (See Section 96).

## Residuary Legatee : శేషలబ్ధిదారు :

వీలునామా వ్రాసినతడు (Testator) తాను చెందజేయదలచిన ఆస్తులను తన యిచ్చవచ్చిన వారికిచ్చివేయగా మిగిలిన ఆస్తులను (Surplus) మరియు - లేదా వీలునామా వ్రాసిన అనంతరము తాను సంపాదించిన ఆస్తులను ఏ ఆసామీకి చెందవలెనని వ్రాయునో అట్టివ్యక్తిని Residuary Legatee లేదా శేషించిన లబ్ధిదారు అంటారు. (Section 102)

వీలునామా వ్రాసిన ఆసామీ (Testator)చనిపోయిన నాటికి సదరు వీలునామాలో వ్రాయబడిన ఆస్తులుకాక శేషించిన ఆస్తులన్నిటిని తీసికొనుటకు Residuary legatee కి అధికారము కలదు. (Sec 103).

# 40 వ అధ్యాయం

## వీలునామా ద్వారా చెందజేయని ఆస్తి ఎవరికి సంక్రమించును?

### Partial Intestacy:

వీలునామా వ్రాయకుండ ఎవరైనా వ్యక్తి మరణిస్తే వారసత్వరీత్యా వాని ఆస్తులు చనిపోయిన వాని వారసులకు దఖలుపడతాయి, మరియొక సందర్భములో కూడా ఇట్లే జరుగవచ్చును. వీలునామాలో ఉద్దేశించబడిన ఒకే లబ్ధిదారు (sole) legatee, Testator కంటెముందే మరిణిస్తే కూడా ఆస్తులు వారసత్వరీత్యా సంక్రమిస్తాయి.

అయితే ఎవరైనా ఆసామీ వీలునామా ద్వారా కొన్ని ఆస్తులను మాత్రమే ఇతరులకు చెందజేసి మిగిలిన ఆస్తులవిషయములో Residuary legatee ని చెప్పకుండ ఎవరికి gift ఈయకుండ మరణిస్తే ఆ శేషించిన ఆస్తులు వారసత్వరీత్యా చనిపోయిన వాని వారసులకు సంక్రమిస్తాయి.

పై విధముగ సంక్రమించిన ఆస్తి ఆ వారసునికి స్వాధీనం ఆయ్యే పర్యంతం Resulting Trust గా ఉంటుంది.

# 41 వ అధ్యాయం

## Doctrine of Lapse: Bequest : రద్దు అగుట:

ఎవరైనా ఆసామీ వీలునామా వ్రాసి (Testator) ఎవనికైనా ఆస్తిని సంక్రమింపజేసిన యెడల ఆ అబ్ధిదారు (Legatee) Testator యొక్క జీవితాంతము వరకు జీవించిఉండనియెడల ఆ Legatee కి ఈయదలచిన Bequest రద్దు అగును (Lapse).

ఎవరేని Residuary ఉంటే వానికి చెందును. మరియొక లబ్ధిదారుకు చెందవలెనని Testator యొక్క అభిమతం కాకపోతే పై విధముగనే జరుగును.

లబ్ధిదారు (Legatee)యొక్క స్థానీయులు ఎవరైనా ఆ Bequest వలన ఫలితం పొందాలంటే Testator మరణించిన నాటికి ఆ Legatee సజీవుడైయున్నట్లు నిరూపించాలి.

ఈ సందర్భమున కొత్తపల్లయ్య Vs గ్రంధి వీరరాఘవమ్మ కేసులో తీర్పు AIR 1954 A.P page 2 at 4 చూచునది,

## జాయింటు అబ్ధిదారులు:

ఎవరైనా ఇరువురు లబ్ధిదారులకు (Legatees) జాయింటుగా ఒక ఆస్తిని సంక్రమింపజేయుగా, Testator కంటే ముందుగనే ఒక లబ్ధిదారు చనిపోతే సదరు Bequest అంతయు మిగిలిన Legatee కి చెందును (See Sec.106)

# 42 వ అధ్యాయం

## దేవాదాయ ధర్మాదాయ సంస్థలకు వ్రాయబడిన వీలునామా చెల్లుబాటు:

దేవాదాయ దర్మాదాయ సంస్థలకు (Religious & Charitable Institutions) వాటి ఉపయోగముల నిమిత్తము వీలునామా ద్వారా హిందువులు బౌద్ధులు, జైనులు, సిక్కులు తమ ఆస్తిని చెందజేయవచ్చును.

Indian Succession Act 1925 Section 118 హిందువులకు వర్తించదు. సదరు సెక్షనులో చెప్పబడిన ఆంక్షలు (limitations & conditions) క్రిష్టియన్ మతస్థులకు మాత్రమే వర్తించును.

# 43 వ అధ్యాయం

## Onerous Bequests: బాధ్యతలతో కూడిన దానము:

ఏదేని బాధ్యతతో సహా ఆస్తిని ఎవనికైన వీలునామా ద్వారా చెందజేసిన యెడల సదరు (Legatee) లబ్ధిదారు సదరు బాధ్యతతోడనే ఆ ఆస్తిని స్వీకరించాలి. లేనిచో అది వానికి చెందకనేపోవును.

ఉదాహరణ: వీలునామా వ్రాసిన ఆసామీకి (Testator) రెండు కంపెనీలలో (X) & (Y) షేర్లున్నాయనుకొందము. Testator కంపెనీలలోని నా షేర్లన్నియు "B" తీసికొనగలందుకు వీలునామా వ్రాసి Testator మృతి చెందియుంటే (X) కంపెనీలోని షేరు లాభసాటిగా ఉన్న వాటిని తీసికొని కష్టాలలో ఉన్న (Y) కంపెనీ అనగా Share call money ~~ఈ~~యవలసిన కంపెనీ షేర్లను విడిచిపెట్టుటకు వీలులేదు. తీసికొనదలచిన యెడల రెండు కంపెనీల షేర్లు తీసికొనవలెను, లేదా రెండూ వదలివెయ్యాలి.

(Section 122 of Indian Succession Act)

ఎవరైనా Testator ఒక legatee కి విడివిడిగా ఒకదానితో మరియొకదానికి సంబంధములేని రెండు ఆస్తులను వీలునామా ద్వారా సంక్రమించపజేస్తే, Testator మరణానంతరం - సదరు legatee తనకు లాభసాటిగా ఉన్న ఆస్తిని స్వీకరించి రెండవదానిని వదిలి వేయవచ్చును. (Section 123 of Indian Succession Act).

# 44 వ అధ్యాయం

## పలురకములైన దానములు (Several Types of Bequests), వివిధ తరగతులకు చెందిన ఆస్తులు (different Kinds of Legacies):

(A) ఒకే తరగతికి చెందిన వారికి ఆస్తిని సంక్రమింపజేయుట : Bequest to a class:

ఒకే తరగతి అనగా:

Children : సంతతి

Grand Children : మనుమలు - మనుమరాండ్రు.

nephews : అన్నదమ్ముల - అక్కచెల్లెళ్ల సంతతికి చెందినవారు.

ఒకే తరగతికి చెందిన సభ్యులకు వీలునామాద్వారా ఆస్తిని సంక్రమింపజేయు సందర్భమున Indian succession Act 1925 లోని 98, 111, 115, 121 సెక్షన్లను వివరముల నిమిత్తం గమనించునది.

# 45 వ అధ్యాయం

## జన్మించని వ్యక్తులకు దానమిచ్చుట:
## (Bequest to unborn persons)

unborn persons కు ఈయబడిన Bequests గురించి Indian Succession Act 112, 113 & 114 సెక్షన్లు చూచునది.

జన్మించని వ్యక్తులకు దానమిచ్చుటలో గమనించదగు అంశములేమనగా: దానమీయబోవువ్యక్తికి అప్పటికి జన్మించని వ్యక్తి దగ్గరబంధువు అయి యుండాలి; వీలునామా వ్రాసేనాటికి సజీవుడైనవ్యక్తికి గాని వ్యక్తులకు గాని జీవితకాలపుహక్కుతో సంక్రమింపజేయాలి; తదనంతరపు హక్కు (Vested) జన్మించని వ్యక్తికి పూర్తిగా చెందజెయ్యాలి, జీవితకాలపుహక్కుతో ఆ దానమును అనుభవించెడి వ్యక్తుల జీవితకాలము ముగియకుండగనే తదనంతరపు హక్కుదారు జన్మించియుండాలి. పైవాటిలో ఏ షరతు లోపించినా ఆ దానము ఆ జన్మించని వ్యక్తికి చెందకుండాపోతుంది:

# 46 వ అధ్యాయం

## నిల్వచేయుట: Accumulation:

వీలునామా ద్వారా ఎవరైనా ఆసామీ (Testator) ఏదేని ఆస్తిపైవచ్చు ఆదాయము కొంతభాగముగాని, లేదా ఆదాయమంతటిని గాని నిల్వచేయవలెనని ఆదేశం ఇచ్చినచో (direction)సదరు విధముగ ఆదా చేయు కాలపరిమితి 18సంవత్సరములుగా గుర్తించవలెను. అంతకు మించినగడువు-అతిక్రమించినట్లే భావించి సదరాస్తిని, ఆదాయమును వీలునామాలో చెప్పినట్లు వినియోగపరచవలెను.

అయితే గడువు తీరిపోయినట్లే భావించనవసరంలేని సందర్భములు కూడా ఉన్నాయి. Testator యొక్క అప్పులు తీర్చవలసిన సందర్భములలోను; ఆదాయమునిచ్చెడి ఆస్తులలో కొన్ని భాగములు Testatorయొక్క సంతతికిగాని మరియొకరికిగాని చెందజేయవలసినప్పుడు;

ఆదాయమునిచ్చెడి ఆస్తిని preserve చేయుటకు, Maintain చేయుటకు అవసరమున్నప్పుడు ఆ గడువును అతిక్రమించవచ్చును.

# 47 వ అధ్యాయం

## షరతులతో కూడిన దానములు

## Contingent & conditional bequests

Indian Succession Act 1925 లోని 124, 125 సెక్షనులలో Contingent Bequest చెప్పబడినవి.

Section 126 ప్రకారం అసాధారణమైన షరతుతో కూడిన దానము చెల్లుబాటుఅవదు.

A Bequest upon an impossible condition is void.

ఉదాహరణ: ఒక గంటలో 100 మైళ్లు "A" నడచిన యెడల A కి వీలునామా ద్వారా ఆస్తి చెందును - ఈ షరతు - ఈ దానము చెల్లనేరవు.

అటులనే న్యాయవిరుద్ధమైన - నీతిబాహ్యమైన షరతుకూడా చెల్లనేరదు.

A Bequest upon a condition, the fulfillment of which would be contrary to Law or to Morality is void'(Section 127).

"C" అను వ్యక్తిని హత్య గావించిన "B" కి రూ500/-లు "A" చెందజేయును - ఈ దానము చెల్లనేరదు, "B" తన భర్తను విడిచి పెట్టినయెడల ఆమెకు "A" రూ500/-లు దానమిచ్చును. ఈ షరతుకూడా చెల్లదు.

# 48 వ అధ్యాయం

## నిర్దుష్ట వస్తుదానము:
## Specific Legacies:

వీలునామా ద్వారా ఈయబడిన ఇతరదానములనుండి వేఋపరచి నిర్దుష్టమైన ఆస్తిని సంక్రమింపజేస్తే దానిని నిర్దుష్ట వస్తుదానం Specific Legacy అంటారు (Sec 142)

ఉదాహరణకు:

నా వజ్రపుటుంగరము నా తదనంతరం "C" తీసికొనవలెను.

నా మెడలో వేసికొనిన బంగారు గొలుసు "D" తీసికొనవలెను.

హైదరాబాద్‌లో గగన్‌మహల్ రోడ్డులో నా స్వంతయింటిలోని furniture అంతయు "E" కి ఈయబడినది.

నాకు "B" అను ఆసామీ బాకీయున్న సొమ్మంతయు "G" కి చెందవలెను.

ఇటువంటివన్నియు Specific Legacies క్రిందికి వస్తాయి.

ఈ సందర్భమున ఏవి Specific Legacies అవుతాయో ఏవి అవవో తెలుసుకునే నిమిత్తం 143 నుండి 149 వరకుగల Indian Succession Act 1925 సెక్షన్లను చదువవలసియున్నది.

# 49 వ అధ్యాయం

## Demonstrative Legacies:

వీలునామా వ్రాసిన ఆసామీ (Testator) ఏదైనా కొంతసొమ్మునుగాని, వస్తురూపేణగాని ఏ లబ్ధిదారుకైనా దానమిచ్చి ఆ సొమ్ముగాని వస్తువులు గాని పొందుటకు ఏదేని నిధిని వస్తు సముదాయాన్ని సమకూర్చితే అట్టి దానమును (Legacy) Demonstrative Legacy అంటారు.

అయితే ఏదేని నిర్దుష్టమైనవస్తువును గాని ఆస్తినిగాని దానమిస్తే అది Specific Legacyఅవుతుంది. కాని ఏదేని నిర్దుష్టమైననిధి నుండి గాని వస్తు సముదాయము నుండి గాని దానమీయబడితే అది Demonstrative Legacy అవుతుంది. (Section 150 I.S.Act చూచునది)

# 50 వ అధ్యాయం

## Ademption of Legacies తనకు కాకుండా పోయిన లేదా రూపాంతరము చెందిన దానం ఏమౌతుంది?

వీలునామా వ్రాసిన ఆసామీ (Testator) చనిపోవు నాటికి వీలునామాలో దానముగా ఈయబడిన ఏ specific ఆస్తియైనా తనకు చెందకుండా పోయినను, రూపంతరము చెందినను సదరు దానము వ్యర్థమైపోవును, సదరు దానము చెల్లదు.

(Section 152 I.S. Act)

ఏ Testator అయినా ఒక ప్రత్యేక నిధిని గాని, వస్తు సముదాయాన్ని గాని ఏర్పరచి తానిచ్చిన దానఫలము సదరు నిధి నుండి వస్తు సముదాయము నుండి తీసి కొనవలెనని ఏర్పాటు చేసెనో ఆ నిధిగాని, ఆ వస్తు సముదాయముగాని లేకుండా పోయినను ఈయబడిన దానము చెల్లుబాటు అవుతుంది. Testator యొక్క ఇతరాస్తుల నుండి రాబట్టు కోవలసివస్తుంది.

(See Sec 153 of I.S.Act.)

Ademption of Legalcies వివరములకు 154 నుండి గల సెక్షన్లను గమనించునది.

# 51వ అధ్యాయం

## క్రిస్టియన్ మతస్థులు వ్రాయు వీలునామాలు.

అన్ని మతస్థుల కంటె క్రిస్టియన్ మతస్థులలో వీలునామా ద్వారా ఆస్తి సంక్రమింపజేయుట ఎక్కువగా చూచుచున్నాము. వీలునామా వ్రాయుట, వ్రాయు వాని యొక్క (Executant ) శారీరక మానసిక పరిస్థితి అనుకూలముగ ఉండుట (Sound and disposing State of mind) ఇద్దరికి తక్కువ కాకుండ సాక్షులు (Attestors) ఇవి అన్నియు ముస్లిములకు కాక ఇతర మతస్థులందరికి సమానమే.

క్రిస్టియన్ మతస్థులు వీలునామా కూడా వ్రాత మూలముగా ఉండాలి. వ్రాసిన వాని సంతకంగాని వేలిముద్ర గాని వీలునామా పై వెయ్యాలి, ఇద్దరు లేక ఎక్కువ మంది. సాక్షి సంతకాలు చెయ్యాలి.

క్రిస్టియన్ మతస్థులు కూడా Previleged wills వ్రాయుటకు - చేయుటకు అర్హత కలదు. అనగా యుద్ధభూమిలో ఉన్న సైనికులు, అటులనే యుద్ధ సమయంలో ఉన్న నావికులు, వైమానికులు కూడా Privileged wills వ్రాయదగుదురు.

క్రిస్టియన్ మతస్థులు వ్రాయు వీలునామా పెండ్లి అయన వెంటనే (అనగా వీలునామా వ్రాసిన వాని will రద్దు అగును.

Probate, Letters of Administration, Succession Certificate పొందుటలోను వీలునామా ఋజువుపరచుటలోను Indian Succession Act, Indian Evidence Act హిందువులకు వలెనే అన్నియు వర్తించును.

# 52 వ అధ్యాయం

## ముస్లిముల వీలునామాలు

ముస్లిం మతస్థులకు Indian Succession Act వర్తించదు. ముస్లిం మతస్థుల వీలునామాలకు చట్టబద్ధమైన నియమాలు ఏవీలేవు.

ముస్లిం మతస్థులలో రెండు తెగలవారున్నారు. ఒకటి షియాలు రెండు సున్నీలు. ఈ రెండు తెగల వారి వీలునామాలకు చాలా తేడాలున్నాయి.

ముస్లింలలో స్త్రీలు, పురుషులు, ఘోషా స్త్రీలు కూడా వీలునామాలు చేయ వచ్చును. ఘోషా స్త్రీల వీలునామాకు ఋజువు భారం ఎక్కువ. ముస్లింలలో మైనర్లు కూడా వీలునామా చేయ వచ్చును. అయితే వీలునామా చేసిన మైనరుకు మెజారిటీ వచ్చేక ఆ వీలునామాను ఆమోదించ వలెను. Ratify చేయవలెను.

వారసులున్న ముస్లిం ఎవరైనా వీలునామా చేయుట గాని వ్రాయుట గాని జరిగించితే అతడికి గల మొత్తం ఆస్తిలో మూడవవంతు ఆస్తిని మాత్రమే వీలునామా ద్వారా చెంద జెయ్యాలి. మిగిలిన రెండు వంతులు వారసత్వ రీత్యాన చెందుటకు వదలి వెయ్యాలి. ఒక ముస్లిం యొక్క నికరాస్తిని గణించుటకు అతడి మరణ సంస్కార ఖర్చులు (funeral expenses) ఇతర ఋణాలు తీర్చివేయగా మిగిలిన ఆస్తి నికర ఆస్తిగా పరిగణించాలి. ఇతర వారసులు అంగీకరిస్తేనే వారసులలో కొంతమందికి ఆస్తి యివ్వవచ్చును.

ముస్లింలు వాంగ్మూలముగా వీలు చేయవచ్చును. (Oral will)

ఒకవేళ వ్రాత మూలకంగా వీలునామా వ్రాసినను దానిపై అతడి యొక్క లేదా ఆమెయొక్క సంతకంగాని, వేలిముద్రగాని సాక్షి సంతకాలు గాని అవసరం లేదు. వీలునామా ద్వారా ఆస్తిని సంక్రమింప జేయాలనే ఇచ్ఛ లేదా కోరిక (Intention) ఉంటే చాలు. అందుకే ముస్లింల Oral వీలునామా ఋజువు

చేయుటలో కష్టం ఎక్కువ. మాట్లాడలేని స్థితిలో సంజ్ఞలతో చేసిన విల్లు కూడా సక్రమమే. ముస్లింల విల్లు ఒక నిర్ధుష్ట పద్ధతిలో ఉండనక్కర్లేదు. మరణం ముందు ఆస్థి చెందే విధానం గురించి వ్రాసిన ఉత్తరం విల్‌గా పరిగణించవచ్చును.

ముస్లింలలో కూడా వీలునామాను రద్దుచేయు (Revoke చేయు) అవకాశము కలదు. మరియొక వీలునామా చేయడం ద్వారా దాని వెనుక నున్న వీలునామా Revoke అగును.

మరియొక ముఖ్యాంశ మేమనగా Executor ముస్లిం కానక్కర్లేదు.

వారసులు అంగీకరిస్తే 1/3 వ వంతుకంటే ఎక్కువ ఆస్థిని విల్‌పై ఈయవచ్చును. ఇతర వారసులు అంగీకరిస్తే వారసులలోని వ్యక్తులకు కూడా విల్‌పై ఆస్థి ఇవ్వవచ్చును. వారసులు లేనివారు యావదాస్థిని విల్‌పై వ్రాయవచ్చును. భార్యయే ఒక వారసురాలు ఉంటే ఆమె వాటా తప్ప మిగతా ఆస్థిపై విల్ వ్రాయవచ్చును. ఆస్థిని విల్‌పై స్త్రీ పురుషులకు ముస్లింలకు, ముస్లింలు కాని వార్కి ఆస్థి యివ్వవచ్చును. గర్భస్థ శిశువుకు ఆస్థి యివ్వవచ్చును.

# మొదటి అనుబంధం

## వీలునామాల నమూనాలు

ఈ నమూనాలలో వాడబడిన పేర్లు అన్నియు ఊహాజనితములే గాని ఏ ఒక్కరిని ఉద్దేశించి వ్రాయ బడలేదని గుర్తించవలెను.

## 1. సామాన్యమైన వీలునామా

------ సంవత్సరం --- నెల --- వ తేదీని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ----- జిల్లా ---- గ్రామం కాపురస్తుడు హిందువు - అయిన నేను మతిస్థిమితం తోను మంచి వ్యవహార జ్ఞానంతోని చెప్పి వ్రాయించిన వీలునామా.

నాకు ప్రస్తుతం ---- సంవత్సరముల వయస్సుకలదు. శరీరము అశాశ్వత మని యెంచి నేను జీవించి ఉండగనే నా యొక్క చర స్థిరాస్తులను గురించి తగిన ఏర్పాటు చేయుట మంచిదని తోచి ఈ వీలునామా వ్రాయించినాను.

నాకు ---- అను భార్యయు, ---- అను కుమారుడు ----- అను ఇద్దరు కుమార్తెలు కలరు. నా కుమారునికి కుమార్తెలకు వివాహాది శుభకార్యములు జరిపించినాను. వారందరు ఎవరి కాపురములు వారు చేసికొనుచు సుఖముగ ఉన్నారు. నాకు గల యావత్తు చర స్థిరాస్తులు 1983 వ సంవత్సరానికి ముందుగనే రెండు సమ వాటాలు వేసుకొని నేను నాకుమారుడు పంచుకొని ఎవరి వాటా ఆస్తులు వారలము విడివిడిగా అనుభవించుచున్నాము. నా అనంతరముకు మిగిలి యుండే యావత్తు చర స్థిరాస్తులు నా అనంతరము నా భార్య నా కుమారుడు నా ఇద్దరు కుమార్తెలు స్వాధీనం చేసుకొని నాలుగు సమవాటాలుగా వేసుకొని ఎవరి వాటాకు వచ్చిన ఆస్తిని వారు దాన విక్రయ సర్వాధికారములతో స్వేచ్ఛగా అనుభవించవలెను. నాకు లోకుల వలన రావలసిన బాకీలు గాని నేను లోకులకు ఈయవలసిన బాకీలు గాని ఏమియు లేవు.

ఇదే నా ఆఖరి వీలునామా అయి యున్నది. ఈ వీలునామాను నా జీవిత కాలంలో రద్దు చేసికొనుటకు మార్పు చేసికొనుటకు హక్కు నా యందుంచుకోవడ మైనది.

ఇందుకు సాక్షులు సంతకం

1)

2)

3)

దస్తూరీ:

## 2. కుమారునికి - భార్యకు ఆస్తిని సంక్రమింపజేయుచు వ్రాయు వీలునామా

1998 సంవత్సరం ఆగస్టునెల 15వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం విశాఖ పట్నం జిల్లా అనకాపల్లి మున్సిపాల్టీ కాపురస్తులు హిందువు వ్యవసాయం లేటు పెంటకోట రామయ్యగారి కుమారుడు సింహాచలం అనే నేను మతిస్థిమితంతోను, మంచి వ్యవహార జ్ఞానంతోను చెప్పి వ్రాయించిన వీలునామా:

నాకు ప్రస్తుతం సుమారు 60 సంవత్సరముల వయస్సు కలదు. శరీరము అశాశ్వతమని యెంచి నా జీవితకాలములోనే నా ఆస్తులకు తగిన ఏర్పాటు చేయ దలంచి ఈ వీలునామా చెప్పి వ్రాయించినాను.

నాకు అప్పారావు అను కుమారుడు, నూకాలమ్మ అను భార్యయు కలరు. నా కుమారునికి పెండ్లి అయి కాపురము చేసికొనుచున్నాడు. నా భార్య నన్ను కనిపెట్టుకుని ఉండి అన్ని విధముల ఉపచారములు చేయుచున్నది.

అనకాపల్లి గ్రామం మున్సిపాల్టీలో నాకు గల మేడ భవంతియు, మార్కెట్టు వీధిని గల నాలుగు కొట్లు, తుమ్మపాల గ్రామంలో గల అయిదు ఎకరముల

వ్యవసాయ భూమియు, ఇంటిలోని చరాస్తియు నా అనంతరము నా కుమారుడు అప్పారావు స్వాధీనపరచుకొని దాన విక్రయు సత్వాది సర్వహక్కులతో అనుభవించవలెను. అయితే నా భార్య నూకాలమ్మకు అనకాపల్లి మార్కెట్టు వీధిలో ఉన్న కొట్లపై వచ్చు ఆదాయం ఆమె జీవితకాలం అనుభవించుటకు నాకుమారుడు అప్పారావు ఈయవలెను.

నా తదనంతరం నా భార్యకు నా కుమారునికి సరిపడని యెడల నా మేడపై నా భార్య కాపురం ఉండుటకు, అవసరం వెంబడిని అద్దెకిచ్చి అందుపై వచ్చు ఆదాయం ఆమె అనుభవించుటకు జీవితకాలపు హక్కు నా భార్య నూకాలమ్మకు ఈయడమైనది. నాకు లోకుల వలన రావలసిన బాకీలు ఏమియు లేవు. నేను లోకులకు ఈయవలసినవి కూడా ఏమియు లేవు. ఇవి గాక నా తదనంతరముకు మిగిలి యుండే Bank నిల్వలు, ఇంకను సంపాదించబడే ఇతర చర స్థిరాస్తులు నా కుమారుడు అప్పారావు స్వాధీనం చేసుకుని సర్వ హక్కులతో అనుభవించ వలెను.

ఇదే నా ఆఖరి వీలునామా అయి యున్నది. ఈ వీలునామాను నా జీవిత కాలములో రద్దు చేసికొనుటకు మార్పు చేసికొనుటకు హక్కు నాయందుంచు కోవడమైనది.

ఇది మంచి తెలివితోను వ్యవహార జ్ఞానంతోను చెప్పి వ్రాయించిన వీలునామా. ఈ వీలునామా నా తదనంతరం అమలులోనికి రావలసియున్నది.

ఇందుకు సాక్షులు: సంతకం

1) AB

2)CD

దస్తూరి:

## 3. బాధ్యతాయుతమైన వీలునామా

1998 సంవత్సరం ఆగస్టు నెల 30వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నెల్లూరు జిల్లా నెల్లూరు మున్సిపాల్టీ కాపురస్తులు హిందువులు బెజవాడ అచ్చిరెడ్డి కుమారుడు క్రిష్ణా రెడ్డి అనే నేను మంచి తెలివితోను వ్యవహార జ్ఞానంతోను చెప్పి వ్రాయించిన వీలునామా:

నాకు ప్రస్తుతం 55 సంవత్సరముల వయస్సు కలదు. దేహం అశాశ్వతమని యెంచి నా జీవిత కాలములోనే నా ఆస్తులకు తగిన ఏర్పాట్లు చేయుట మంచిదని తోచి ఈ వీలునామా వ్రాయించినాను.

నాకు అచ్చిరెడ్డి, వీర్రెడ్డి, ప్రతాపరెడ్డి అను ముగ్గురు కుమారులు, విజయలక్ష్మి, మహేశ్వరి అను కుమార్తెలు, పోలమాంబ అను భార్య కలరు. వీరే నాకు సన్నిహిత బంధువులైయున్నారు. నాకుమార్తెలలో పెద్దకుమార్తెకు పెండ్లి చేసినాము. రెండవ కుమార్తెకు ఇంకను వివాహము కావలసి యున్నది. మా కుటుంబ గౌరవము మర్యాదలను అనుసరించి మా రెండవ కుమార్తెకు మేమే పెండ్లి చేయగలము. ఏ కారణము చేతనైన నేను నా జీవిత కాలములో మా రెండవ కుమార్తెకు పెండ్లి చేయలేక పోయిన యెడల నా తదనంతరం మా పెద్దకుమారుడు అచ్చిరెడ్డి నేను State Bank of India లో నిల్వ చేసిన Fixed deposit సొమ్ము మూడు లక్షల రూపాయలలో అవసరమైనంత ఖర్చుచేసి వివాహాది శుభకార్యములు జరిగించవలెను.

నేను నా కుమాళ్ళు, కుమార్తెలతో మా యావదాస్తులు పంచుకొనగా నాకు నెల్లూరు మున్సిపాల్టీ గొడుగు పేటలో గల మేడ భవంతి నా వాటాకు వచ్చినది. అటులనే కోవూరు గ్రామంలో నా వాటాకు నాల్గు ఎకరముల వ్యవసాయ భూమి వచ్చినది. నా తదనంతరం నా భార్య పోలమాంబ మా మేడ భవంతిని స్వాధీనం చేసుకుని దీర్ఘకాలపు కవుళ్ళు ఈయకుండ, తనఖా వగైరా అన్యాక్రాంతములు చేయకుండ అందుపై వచ్చు ఆదాయం మాత్రం అనుభవించుటకు ఏర్పాటు చేయడమైనది. ఆమె తదనంతరం సదరు మేడ భవంతిని మూడు సమవాటాలుగా

వేసుకుని మా ముగ్గురు కుమాళ్ళు దాన విక్రయ సత్వాధికారములతో అనుభవించుటకు ఏర్పాటు చేయడమైనది.

నేను నెల్లూరు గ్రామంలో గల "తిక్కన సాహిత్య మండలి" సంస్థకు ప్రతి సంవత్సరం తిక్కన జయంతికి ఒక వెయ్యి రూపాయలు విరాళము ఇచ్చుచున్నాను. నా వ్యవసాయ భూములపై వచ్చు ఆదాయమునుండి నా పెద్ద కుమారుడు సదరు సంస్థ ఉన్నంత కాలము ఆ విరాళమును ఇచ్చుచుండ వలెను.

నేను పెన్నానదీ తీరమందు నరసింహ స్వామి ఆలయములో స్వామికి వైశాఖ మాసములో ప్రతి సంవత్సరము కళ్యాణము చేయించుచున్నాను. నా తదనంతరం నా పెద్ద కుమారుడు ఉచితమైన సొమ్ము వ్యయ పరచి స్వామికి కళ్యాణ మహోత్సవము చేయించు చుండవలెను.

కోవూరు గ్రామంలో నాకు గల నాల్గు ఎకరముల భూమి యందు నా అనంతరం నా పెద్ద కుమారుడు రెండు ఎకరముల భూమిని స్వాధీనం చేసికొని పైన వ్రాయబడిన ధర్మకార్యములు నిర్వహిస్తూ దాన విక్రయ సత్వాధికారములతో అనుభవించవలెను. మిగిలిన రెండు యకరముల భూమిని నా రెండు, మూడు కుమాళ్ళు నా అనంతరం స్వాధీనం చేసుకుని దాన విక్రయ సత్వాధికారములతో అనుభవించవలెను.

నా తదనంతరముకు మిగిలియుండే Bank నిల్వలు అనగా నా రెండవ కుమార్తె పెండ్లి నిమిత్తం కేటాయించిన సొమ్ముగాక మిగిలిన వన్నియు నా ముగ్గురు కుమాళ్ళు మూడు సమవాటాలుగా తీసికొని సర్వ హక్కులతో అనుభవించవలెను. నేను లోకులకు ఈయవలసిన బాకీలు గాని నాకు లోకుల వలన రావలసిన బాకీలు గాని ఏమియులేవు.

ఇదే నా ఆఖరి వీలునామా అయి యున్నది. ఇది నా జీవిత కాలంలో మార్పు చేసికొనుటకు రద్దు చేసికొనుటకు హక్కు నా యందుంచు కోవడమైనది. ఇది నా తదనంతరం అమలులోకి రావలెను.

ఇది మంచి తెలివితోను వ్యవహార జ్ఞానంతోను వ్రాయించిన వీలునామా.

ఇందుకు సాక్షులు: సంతకం

1) EF

2) GH

## 4. జాయింటు వీలునామా నమూనా

1998 సంవత్సరం ఆగస్టునెల 30వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కర్నూలు జిల్లా కర్నూలు మున్సిపాల్టీ కాపురస్తులు హిందువులు కోట శివయ్యగారి కుమార్డు మల్లయ్య అనే నేనున్ను నా భార్య అన్నపూర్ణ అను నామెయు కలసి వ్రాయించిన జాయింటు వీలునామా.

మాలో మొదటి ఆసామీ మల్లయ్యకు ప్రస్తుతం 65 సంవత్సరముల వయసు కలదు. రెండవ ఆసామీ అన్నపూర్ణకు 59 సంవత్సరముల వయసు కలదు. శరీరములు అశాశ్వతమనియు మా ఉభయుల జీవిత కాలము లోనే మా ఆస్తులకు తగిన ఏర్పాట్లు చేయుట మంచిదని యెంచి ఈ జాయింటు వీలునామా వ్రాయించడ మైనది.

మాకు కుమారస్వామి, గణపయ్య అను ఇద్దరు కుమాళ్ళు మాత్రం కలరు. వారిద్దరు విద్యావంతులై వివాహములు చేసికొని ఉద్యోగములు చేసికొనుచు ఎవరి కాపురములు వారు చేసికొనుచున్నారు.

మాకు కర్నూలు మున్సిపాల్టీలో గల డాబాయిల్లు, చరాస్తి అంతయు మా స్వార్జితం అయి యున్నది. మాకుమాళ్ళిద్దరు మా యందు ప్రేమ-భక్తితోనే కనిపెట్టుకొని చూచుచున్నారు.

మా యిరువురలో ఏ ఒకరు ముందు చనిపోయినను రెండవ వారికి మా ఆస్తులన్నియు సంక్రమించవలసియున్నది. అయితే మా యిరువురిలో ఏ ఒకరికి సంక్రమించినా సదరాస్తులలో కర్నూలు గ్రామంలోని డాబాయిల్లు స్వాధీనం కలిగి

దాన విక్రయాదులు లేకుండ Life interest (జీవితకాలపు) హక్కుతో మాత్రం అనుభవించవలెను. మాయిద్దరి తదనంతరం సదరు డాబా యింటిని మాకుమాళ్ళు కుమారస్వామి, గణపయ్య రెండు సమవాటాలుగా తీసుకొని గణపయ్య తూర్పువైపు భాగమును కుమారస్వామి పశ్చిమం వైపు భాగమును తీసికొని దాన విక్రయాది సర్వహక్కులతో అనుభవించవలెను.

మా ఇరువురి అనంతరముకు మిగిలియుండే వెండి బంగారు ఆభరణములు, పాత్రసామాను furniture, నగదు, Bank నిల్వలు మా ఇద్దరి కుమాళ్ళు మా ఇద్దరి అనంతరము స్వాధీనము పొంది సర్వహక్కులతో అనుభవించవలెను. ఇది మా ఇరువురిలో ఒకరి తదనంతరం మరియొకరికి పైన వ్రాసిన ప్రకారం అమలు జరుగుచూ, మా ఇరువురి అనంతరం మా ఇద్దరి కుమాళ్ళకు పైన వ్రాసిన ప్రకారం అమలు జరుగవలసి యున్నది. ఈ వీలునామాలోని అంశములు మా ఇద్దరి జీవిత కాలములో రద్దు చేసికొనుటకు మార్పు చేసికొనుటకు హక్కు మా యందుంచు కోవడమైనది.

ఇదే మా ఆఖరి వీలునామా అయి యున్నది. ఇది మేమిద్దరం మంచి తెలివితోను వ్యవహార జ్ఞానంతోను చెప్పి వ్రాయించినది అయి యున్నది.

ఇందుకు సాక్షులు:

1)

2)

1)

2)

సంతకములు

దస్తూరి:

## 5. వీలునామా ద్వారా గార్డియన్‌ని నియమించుట

1998 సంవత్సరం ఆగస్టునెల 26వ తేదీని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రరాజధాని హైదరాబాద్ మున్సిపల్ కార్పొరేషన్ హిమయత్‌నగర్ కోలని కాపురస్తులు హిందువు

కోగంటి సత్యనారాయణ గారి కుమారుడు రామ చంద్రరావు అనే నేను మంచి తెలివితోను వ్యవహార జ్ఞానంతోను వ్రాయించిన వీలునామా అనే మరణశాసనం.

నాకు విజయలక్ష్మి అనే భార్యయు, మోహన్ చంద్ర, సురేష్ అను ఇరువురు కుమాళ్ళు, లలిత, పద్మావతి అను ఇద్దరు కుమార్తెలు కలరు.

శరీరము అశాశ్వతమనియు ఎప్పటికి ఎట్లుండునో అనియు, నా జీవితకాలము లోనే నా ఆస్తులకు సరియైన ఏర్పాటు చేయుట మంచిదని తోచి స్వయముగ చెప్పి ఈ వీలునామా వ్రాయించినాను. నాకు పిత్రార్జితముగ వచ్చిన తెనాలి గ్రామంలోని భూమిని విక్రయించి ఆ సొమ్ముతో హైదరాబాద్ పరిసర ప్రాంతములలో Real Estate వ్యాపారం చేసి హైదరాబాద్ గ్రామంలో హిమయత్ నగర్‌లోను బంజారాహిల్సు వద్ద రెండు మేడలు కట్టించి యున్నాను. ఇవి కాక నాకు ఇంకను హైదరాబాద్ నుండి విజయవాడ వెళ్ళు బస్సు రూట్‌లో కొన్ని నివేశన స్థలములు కలవు. నేను బిల్డింగు Contracts చేసి మరికొంత ధనము నార్జించినాను. నాకు State Bank of Hyderabad లోను, ANZ గ్రిండ్‌లేస్ Bank లోను కొన్ని fixed deposits కలవు.

మా పెద్దకుమారునికి, పెద్దకుమార్తెకు వివాహములు జరిగించినాము. మా పెద్ద కుమారుడు హైదరాబాద్ సమీపంలో డైరీ వ్యాపారం చేసికొనుచున్నాడు. మా రెండవ కుమారునికి ఇంకను మెజారిటీ రాలేదు. చదువుకొనుచున్నాడు. మా రెండవ కుమార్తెకు వివాహాది శుభకార్యములు జరిగించవలసి యున్నది.

నా తదనంతరం మాకు బంజారా హిల్సు వద్ద గల మేడ భవంతిని మాకుమాళ్ళిద్దరు రెండు సమవాటాలుగా తీసికొని స్వాధీనం చేసికొని దాన విక్రయ సత్వాధికారములతో అనుభవించవలెను.

నాకు హిమయత్ నగర్ కోలనీలో గల మేడ భవంతి మూడు వాటాలుగా ఉన్నది. నా తదనంతరం మా కుమార్తెలిద్దరు, నా భార్య సదరు మేడ భవంతిని స్వాధీన పరచుకొని ముగ్గురు మూడు సమవాటాలుగా తీసికొని దాన విక్రయ సత్వాధికారములతో అనుభవించవలెను.

నాకు గల Bank నిల్వలలో నుండి నా భార్యయు, నా పెద్దకుమారుడు సొమ్ముతీసికొని మా రెండవ కుమార్తెకు వివాహాది శుభ కార్యములు జరిగించ వలసి యున్నది. మా కుటుంబ గౌరవము మర్యాదను అనుసరించి నా భార్య తనకు తోచిన ఉచితమైన సొమ్ము ఖర్చు పరచి మా రెండవ కుమార్తె చి॥సౌ॥ పద్మావతికి వివాహాది శుభకార్యములు జరిగించవలెను. మా రెండవ కుమార్డు సురేష్‌కు ఇంకను మెజారిటీ రాలేదు. ఏదైనా వ్యవహారములలో అవసరమని తోచిన యెడల నా భార్య మా రెండవ కుమారునికి గార్డియన్‌గా వ్యవహరించవలెను.

పైన వ్రాయబడిన ఆస్తులు కాక నా తదనంతరముకు ఇంకను మిగిలియుండే చరస్థిరాస్తులు నా భార్యయు, నా కుమాళ్ళిద్దరు స్వాధీన పరచుకొని మూడు సమవాటాలుగా పంచుకొని దాన విక్రయాది సర్వహక్కులతో అనుభవించవలెను.

ఈ వీలునామా నా తదనంతరం అమలులోనికి రావలసియున్నది. ఇదే నా ఆఖరి వీలునామా అయి యున్నది.

నా జీవిత కాలంలో ఈ వీలునామాను రద్దు పరచుటకు, మార్పు చేసికొనుటకు హక్కు నాయందుంచుకోవడమైనది.

ఇది మంచి తెలివితోను వ్యవహార జ్ఞానంతోను చెప్పి వ్రాయించిన వీలునామా అయియున్నది.

ఇందుకు సాక్షులు: సంతకం

1)

2)

దస్తూరి:

## 6. వీలునామా ద్వారా ట్రస్టు ఏర్పాటు చేయుట Executor ని నియమించుట

1998 సంవత్సరం ఆగస్టునెల 30వ తేదీని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రి మున్సిపల్ కార్పొరేషన్ కాపురస్తులు హిందువులు భూమంచిరెడ్లు కర్రి నారాయణరెడ్డిగారి కుమారుడు రాజారెడ్డి అనే నేను మంచి తెలివితోను వ్యవహార జ్ఞానంతోను చెప్పి వ్రాయించిన వీలునామా అనే మరణ శాసనం:

నాకు సుమారు 70 సంవత్సరముల వయస్సు కలదు. నాకు మాణిక్యం అనే భార్యయు, వెంకటరెడ్డి అనుకుమారుడు మాత్రం కలరు. నాకు శరీరములో అనారోగ్యముగా ఉండుటచే దేహము అశాశ్వతమని యెంచి నేను జీవించి ఉండగనే నా ఆస్తులకు తగిన ఏర్పాటు చేయుట మంచిదని తోచి నేను స్వయముగ చెప్పి ఈ వీలునామా వ్రాయించినాను.

నేను స్వల్పమైన నా పిత్రార్జిత ధనంతో కలప వ్యాపారం చేసి ధనార్జన చేసినాను. నా వ్యాపారం ఇంకను సాగుచున్నది. మా కుటుంబమునకు గల యావత్తు చర స్థిరాస్తులు నేను నాకుమార్డు రాజారెడ్డియు రెండు సమవాటాలుగా వేసుకొని ఎవరి వాటాకు వచ్చిన ఆస్తులను వారలము ప్రత్యేకముగ అనుభవించుచున్నాము. నా కుమార్డు వివాహాది శుభకార్యములు జరిగి సంతానవంతుడై మా నుండి వేరుగ ఉండి కాపురము చేసికొనుచున్నాడు. మా వ్యాపారంలో అతడు కూడా వాటాదారుగా ఉండి వ్యాపారం చేయుచున్నాడు.

నా తదనంతరం నా భార్య మాణిక్యం మేము ప్రస్తుతం కాపురం ఉంటూయున్న మేడ భవంతిని స్వాధీనం చేసుకుని జీవిత కాలపు హక్కుతో దాన విక్రయాది హక్కులు లేకుండ అనుభవించవలెను. నా భార్య మాణిక్యం తదనంతరం సదరు మేడభవంతిని మా కుమార్డు రాజారెడ్డి స్వాధీనం చేసుకుని దాన విక్రయాది సర్వ హక్కులతో అనుభవించవలెను.

నేను నా స్వార్జిత ద్రవ్యంతో గోదావరి గట్టున ఒక ధర్మశాల నిర్మించి సాధువులకు బసలు భోజనములు యధాశక్తి ఏర్పాటు చేయుచున్నాను. నా తదనంతరం కూడా సదరు యేర్పాటు కొనసాగుటకు నా పేరుతోను నా కుమారుని పేరుతో (Joint Names తో) Bank లో ఒక లక్ష రూపాయల నిధి ఏర్పాటు

చేసినాను. సదరు Deposit నుండి ప్రతీ నెల వచ్చెడి వడ్డీతో నా కుమారుడు నా అనంతరం అతడికి ఉచితమని తోచిన విధముగ సాధువులకు బసలు భోజనములు ఏర్పాటు చేయవలెను.

ఇదేనా ఆఖరి వీలునామా అయి యున్నది.

ఇది నా తదనంతరం అమలులోనికి రావలెను. ఈ వీలునామాను నేను మంచి తెలివితోను వ్యవహార జ్ఞానంతోను చెప్పి వ్రాయించినది అయియున్నది.

ఇందుకు సాక్షులు: సంతకం.

1)

2)

దస్తూరీ:

## 7. వీలునామాలో వ్రాయబడిన అంశములను మార్పుచేయుచు కొడిసిల్ (Codicil) వ్రాయుట

1998 సంవత్సరం ఆగస్టు 31వ తేదీని ఆంధ్రరాష్ట్రం ముఖ్యపట్టణమైన హైదరాబాద్ నగర నివాసి హిందువు వ్యాపారస్థుడు అయిన సింగంపల్లి సూరయ్య శ్రేష్టి కుమారుడు బంగారయ్య సెట్టి అనే నేను మంచి తెలివితోను వ్యవహార జ్ఞానంతోను చెప్పి వ్రాయించిన కొడిసిల్.

నేను లోగడ అనగా 2-81996వ తేదీన ఒక వీలునామా వ్రాసి రిజిస్టరీ కూడా చేయించినాను. తదనంతరం మా కుటుంబములో వచ్చిన మార్పులను బట్టి ఈ కొడిసిల్ వ్రాయించ వలసి వచ్చినది.

పైన వ్రాయబడిన వీలునామా తరువాత మా కుమార్తె రత్నకుమారీకి వివాహాది శుభకార్యములు జరిగించినాము. అందుచే సదరు రత్నకుమారీ పెండ్లి నిమిత్తము కేటాయించ బడిన Bank deposit ఖర్చు అయినది. సదరు రత్నకుమారీకి

ఈయవలసిన నగదు item నుసదరు వీలునామా నుండి తొలగించవలసి యున్నది. అంతేకాక సదరు R. రత్నకుమారీకి మా యింటికి తూర్పువైపున ఉన్న 300 గజముల కాళీ నివేశన స్థలం ఈయదలచినాను. నా అనంతరం మా కుమార్తె R. రత్నకుమారి సదరు స్థలమును స్వాధీనం చేసుకుని దానవిక్రయాది సర్వహక్కులతో అనుభవించ వలెను. ఇంతకుమించి మార్పులులేవు. ఈ Codicil సదరు వీలునామాలో భాగంగా చదువవలెను.

ఇందుకు సాక్షులు: సంతకం

1)

2)

దస్తూరీ:

## 8. కేవియట్ (CAVEAT)

ది ఇండియన్ సక్సెషన్ Act 5 వ షెడ్యూలు ప్రకారం కేవియట్ ఈ దిగువ Model లో ఉంటుంది. ఈ నమూనాకు C P Code ప్రకారం కోర్టుపేరు - పార్టీల పేర్లు మొదలైన Cause Title వ్రాసి ఉపయోగించుకోవలెను.

Let nothing be done in the name of the estate of __________ AB late of deceased who died on the _____ day of _______ at _____ without notice to CD of __________.

కేవియట్ అనగా "నీవుతీసికొనబోవు చర్యలు ముందుగా మాకు తెలియజేయుము" అని సూక్ష్మముగా అర్థము చేసికొనవచ్చును.

కేవియట్‌ను కోర్టులో దాఖలు చేసి దాని నకలును ఎదురు పార్టీకి పంపి, పంపినట్లు కోర్టుకు తెలియజెయ్యాలి. ఒక Caveat 90 రోజులు మాత్రం force లో ఉంటుంది.

Caveat ను వీలునామా విషయంలోనే కాకుండ ఏ ఇతర వ్యవహారంలో అయినా కూడా అమలు జరుపవచ్చును.

Injunction, Stay, Commissioner appointment లేదా ఆస్తికి Receiver ని నియమించుట మొదలగు Interim orders ను ఎదిరి పార్టీ Respondent యొక్క పరోక్షంలో (Exparte) కోరకుండా నిరోధించడమే Caveat యొక్క ముఖ్యోద్దేశ్యము అయియున్నది.

## 9. ప్రోబేట్ Probate

ఇది కోర్టు ఇచ్చేడి అధికార పత్రము. దీని నమూనా The Indian Succession Act 6 వ షెడ్యూలులో ఈయబడినది. ఈ Order కోర్టు ఇచ్చునది గనుక దాని నమూనా ఇచ్చుట ఈయలేదు. వీలునామాలోని అంశములను అమలు జరుపు ఆసామీకి Executor కి గాని beneficiary కి గాని కోర్టు ఇచ్చు అధికార పత్రమునకు ప్రొబేట్ అని పేరు. వీలునామా వ్రాసిన ఆసామీ (Executant of the will) చనిపోయినట్లు ధృవపడిన తరువాత వీలునామా Law ప్రకారం ఋజువు చేయబడిన యెడల సదరు వీలునామాను అమలు చేయు ఆసామీకి వీలునామా నకలుతో సహా Probate ఈయబడును. దీని నిమిత్తం జిల్లా కోర్టులో దరఖాస్తు చేసికొనవలసి యున్నది.

The Indian succession Act లోని సెక్షను 289 ప్రకారం Probate ఈయబడును. అయితే Probate నిమిత్తం The Indian Succession Act Section 276 ప్రకారం దరఖాస్తు చేయవలెను.

The Indian Succession Act Section 293 ప్రకారం వీలునామా వ్రాసిన ఆసామీ మరణించిన ఏడు రోజులలోగా మాత్రం Probate ఈయరాదు.

ప్రొబేట్ నిమిత్తం దరఖాస్తు చేయు ఆసామీ రుజువు చేయవలసిన అంశములు:

వీలునామా వ్రాసిన ఆసామీ (Testator) మరణించిన తేది - సమయం.

తాను దాఖలు చేసిన వీలునామాయే ఆఖరి వీలునామా అనియు; Law ప్రకారం Testator వీలునామా వ్రాసెననియు, దరఖాస్తుదారుకు వీలునామా ద్వారా

వచ్చేడి ఆస్తుల విలువ - వివరములు దరఖాస్తుదారే వీలునామాలో వ్రాయబడిన Executor లేదా Beneficiary అనియు రుజువు (Prove) చెయ్యాలి. Testator యొక్క మరణమును ఋజువు చేయుటకు మున్సిపాల్టీనుండి Death సర్టిఫికేటు తెచ్చుకుని దాఖలు చేసి ఋజువు పరచవచ్చును. వీలునామాపై సాక్షి సంతకములు చేసిన వారిని, అవసరం వెంబడిని ఇద్దరు సాక్షులను విచారణ చేసి వీలునామాను ఋజువు చెయ్యాలి.

పై ప్రకారం Competent Court నుండి పొందిన Probate ను ఉపయోగించి Executor గాని beneficiary గాని వీలునామా ప్రకారం రాబట్టుకోవలసిన ఆస్తులను స్వాధీనం పొందవచ్చును. ప్రొబేటు పొందిన ఆసామీకి చెల్లించిన రుణములు, స్వాధీనం చేయబడిన ఆస్తులకు చెల్లించిన, స్వాధీనం చేసిన ఆసామీలకు పూర్తి రక్షణ (Indemnity) కల్పించ బడినది.

## 9. Letters of Administration

The Indian Succession Act 7 వ షెడ్యూలులో Letter of Administration నమూనా ఈయబడినది. ప్రొబేట్ వలె ఇదియును కోర్టు ఇచ్చేడి అధికార పత్రము. సదరు అధికార పత్రాన్ని పురస్కరించుకొని Testator యొక్క ఆస్తులను వీలునామాలో వ్రాసిన ప్రకారం Management చేయు ఆసామీని Executor అంటారు.

Letter of administration ఇచ్చేడి అధికారము కోర్టుకు Sec.228 of Indian Succession Act ప్రకారము కలదు.

### Letter of Administration **ఎవరికి ఈయాలంటే?**

1. ఎవరైనా ఒక ఆసామీ వీలునామా వ్రాసి ఆ వీలునామాలోని అంశములను అమలు పరచుటకు Executor ని నియమించకపోతే Universal Legatee కి గాని Residuary legatee కి గాని Letter of Administration ఈయవచ్చును.

2. వీలునామాను ఋజువు పరిచి తాను ఆయా అంశములను అమలు పరచే లోగా Executor మరణించినను, లేదా Testator కంటె ముందుగనే Executor మరణించినా Universal Legatee కి గాని మరియొకరికి అనగా Residuary legatee s కి గాని ఆ Letter of Administration మంజూరు చేయవచ్చును.

పైన వ్రాయబడిన ఆసామీలు ఎవరును లేక పోయినను, ఉండియు ఆస్తులు Manage చేయుటకు అంగీకరించక పోయినను, లబ్ధిదారులలో ఏ ఒక Legatee కైనను లేదా ఎవరైనా Creditor కైనను వీలునామా ఋజువు పరచే యెడల Letter of Administration మంజూరు చేయవచ్చును.

## Letter of Administration ఎవరికి ఈయరాదు:

మైనరుకు గాని మతిస్థిమితంలేని వానికి గాని Letter of Administration మంజూరు చేయరాదు. Letter of Administration పొందునిమిత్తం దరఖాస్తు చేయుట;

Indian Succession Act సెక్షను 278 ప్రకారం కోర్టుకు దరఖాస్తు ఈ క్రింది వివరములతో దాఖలు చెయ్యాలి.

A) మరణించిన వాని యొక్క మరణ వివరాలు స్థలం -తేదీ - టైము.

B) మరణించిన వాని కుటుంబ సభ్యుల వివరాలు ఎడ్రస్సులతో సహా;

C)దరఖాస్తుదారు ఏ హోదాతో దరఖాస్తు చేయుచున్నది తెలుపు వివరాలు

D) దరఖాస్తుదారుని చేరెడి ఆస్తి విలువ వివరాలు

E) ఏ కోర్టు Jurisdiction లో మరణించిన వానికి స్థిర నివాసము కలదో లేదా అంతా గాని కొంతగాని ఆస్తికలదో ఆ వివరాలు

పై వివరాలు వ్రాసి Civil Procedure Code లో చెప్పబడిన ప్రకారం Verification కూడా వ్రాయాలి.

## 11. అప్పీళ్ళు

జిల్లా జడ్జిగాని అధికారం పొందిన ఇతర కోర్టుగాని ఈ సందర్భములో Pass చేసిన ఆర్డరుపై అప్పీలు చేసుకోవచ్చును. The Indian Succession Act Section 299.

జిల్లా జడ్జికి ఏయే అధికారములైతే సంక్రమింపజేయబడినవో అట్టి అధికారములన్నియు హైకోర్టుకు కూడా కలవు. Concurrent Jurisdiction అని తెలియనగును. (Section 300 of the Indian Succession Act)

ఎవరైనా Executor ని గాని administrator ని గాని Suspend చేయుటకు పదవి నుండి తొలగించుటకు హైకోర్టుకు అధికారము కలదు.

అవసరం వెంబడిని ఏదైనా direction ఇచ్చుటకు హైకోర్టుకు అధికారం కలదు. (Section 302)

ఎవరైనా Executor లేదా administrator గాని మరణించిన వాని ఆస్తులను అన్యధాగా వెచ్చించిన యెడల (misapply) దానివలన కలిగిన నష్టమునతడు భర్తీ చేయవలసి యుండును. (Section 368)

ఎవరైనా Executor లేదా administrator గాని తన యొక్క అలసత్వము వలన (neglect) మరణించిన వాని ఆస్తికి నష్టము కలుగ జేస్తే దానినాతడు భర్తీ చేయవలసి యుండును. (Section 369)

## 12. వారసత్వం సర్టిఫికేటు
## (Succession Certificate)

ఇండియన్ సక్సెషన్ Act 10వ అధ్యాయంలో 370 వ సెక్షన్ నుండి విపులంగా వ్రాయబడింది.

మరణించిన వానికి రావలసిన బాకీలు (debts) సెక్యూరిటీలు తాను

రాబట్టుకొనుటకు అధికారం ఇస్తూ సర్టిఫికేటు ఇప్పించ మని జిల్లా జడ్జీకి గాని లేదా అందుకు నియమింపబడిన మరియొక అధికారికి గాని పిటీషను దాఖలు చెయ్యవలసి యున్నది.

మరణించిన వాని ఆస్తులు ఏ జిల్లా జడ్జి Jurisdiction లో ఉన్నవో ఆ జిల్లా జడ్జీ కోర్టులో పిటీషను దాఖలు చెయ్యాలి. ఆ పిటీషను సివిల్ ప్రొసీజరు కోడ్‌లో చెప్పబడిన ప్రకారం వ్రాసి Verification కూడా చేసి దాఖలు చెయ్యాలి. ఆ పిటీషనులో వ్రాయవలసిన ముఖ్యాంశాలు

కోర్టు Cause Title.

పిటీషను దాఖలు చేయువాని పేరు, తండ్రిపేరు, వయస్సు - వృత్తి - నివాసం,

రెస్పాండెంట్సుగా చేర్చదగిన వారుంటే వారి పేర్లు, తండ్రిపేరు, వయస్సు, వృత్తి నివాసం - address.

ఏ టైములో Testator మరణించెనో ఆ తేది - Time - స్థలము.

మరణ సమయానికి Testator యొక్క స్థిర నివాసము.

మరణించిన వాని కుటుంబ సభ్యుల ఇతర సన్నిహిత బంధువుల పేర్లు - వివరాలు - వారి నివాసం;

పిటీషనరుకు సదరాస్తులను debts వగైరాలను రాబట్టుకొనుటకు గల హక్కు;

సర్టిఫికేటు మంజూరు చేయుటకు ఇతరములైన ఆటంకములేవియు లేవు కద సర్టిఫికేటు ద్వారా రాబట్టుకో దలచిన debts మరియు సెక్యూరిటీల వివరాలు; పైన వ్రాయబడిన వివరాలతో కోర్టులో పిటీషను దాఖలు చెయ్యాలి. విచారణ అనంతరం సక్సెషన్ సర్టిఫికేటు ఈయవచ్చునని కోర్టు ఆర్డరు వేస్తే సదరు సర్టిఫికేటును Engross చేయుటకు Non-Judicial Stamp అవసరం. అందునిమిత్తం సర్టిఫికేటు ద్వారా రాబట్టుకోదలచిన ఆస్తుల విలువను బట్టి కోర్టు నిర్ణయించిన సొమ్ము చెల్లించాలి. కోర్టు Non-Judicial Stamp తెప్పించి అందుపై

సర్టిఫికేటు వ్రాయించి సంతకముతో Seal తో పిటీషనరుకు యిచ్చును. దానిని ఆధారముగా చేసికొని పిటీషనరు debts ను సెక్యూరిటీలను రాబట్టు కొనును. కోర్టుద్వారా పొందబడిన వారసత్వం సర్టిఫికేటు holder కి చెల్లించిన బాకీలకు, సెక్యూరిటీలకు రక్షణ ఉంటుంది. అనగా బాకీలు చెల్లించిన ఆసామీకి రక్షణ ఉంటుంది.

**అప్పీలు:** వారసత్వం సర్టిఫికేటు ఇచ్చుటకు ఆర్డరు వేసినను, ఇచ్చుటకునిరాకరిస్తూ ఆర్డరు వేసినను లేదా ఇచ్చిన సర్టిఫికేటు Revoke చేస్తూ వేసినను అందుపై హైకోర్టుకు అప్పీలు చేసికొనవచ్చును.

అదనపు సెక్యూరిటీలు, బాకీలకు మరల సర్టిఫికేట్ యిచ్చుట : మొదటి పిటీషన్‌లో ఉదహరించిన బాకీలు, సెక్యూరిటీలు కాక ఇంకా ఏమైనా బాకీలు సెక్యూరిటీలు వసూలు చేయవలసినవి ఉంటే కోర్టు అదనపు కోర్టు ఫీజు చెల్లించగానే - అడిషనల్ సక్సెషన్ సర్టిఫికేట్ యిచ్చును.

# రెండవ అనుబంధము

## (A) Probate
## (B) Letters of administration
## (C) Succession Certificate

(A) పైన వ్రాయబడిన మూడూ కూడా Competent Court చే ఈయబడే అధికార పత్రాలే. అయితే ఏ సందర్భములో దేనిని గురించి దరఖాస్తు చెయ్యాలో తెలుసుకోదగును:

The Indian Succession Act 1925 Section 2 (f) లో Probate అంటే ఈ క్రింద విధమైన నిర్వచనం ఇచ్చింది:

"Probate means the copy of a Will certified under seal of a Court of competent Jurisdiction with a grant of administration to the estate of the Testator."

వీలునామాలో నిర్ధారణ చేయబడిన వ్యక్తికి కోర్టు ద్వారా ఈయబడే అధికార పత్రం. అంటే Probate పొందాలంటే వీలునామాని Prove చేసి కోర్టుద్వారా అధికారం పొంది Testator యొక్క ఆస్తు లను Management చెయ్యవచ్చును. Probate కు వీలు నామా ముఖ్యం అని తెలుసు కోవాలి.

(B)Letter of Administration

ఇదికూడా Competent Court నుండి పొందే అధికార పత్రమే.

అయితే వీలునామా ఉంటే దానిని Prove చేసి అందు వ్రాయబడిన ప్రకారం Testator యొక్క ఆస్తులను కోర్టు Order ని పురస్కరించుకుని administrator management చేయవచ్చును.

హిందువులు, బౌద్ధులు, జైనులు మహమ్మదీయులు కాని వారికి వీలునామా లేకపోయినా Intestate గా చనిపోయిన వాని ఆస్తిని Manage చేయుటకు Competent Court నుండి అధికార పత్రము పొందవచ్చును. ఇది ఇండియన్

క్రిస్టియన్లకు ఏ మతానికి చెందని వారికి Intestate గా చనిపోయిన వాని వారసులకు ఆస్తిని సంక్రమింప జేయుటకు అవకాశ మిచ్చును. భర్త చనిపోయిన యెడల వాని ఆస్తిని Manage చేయుటకు భార్యను Administrator గా నియమించి కోర్టు Letter of Administration ఇచ్చుటకు వీలు కల్పించు సెక్షనిది. ఇతరులకు కూడా ఈ అధికారం ఈయవచ్చును. ఎవరైనా వ్యక్తి వీలునామా వ్రాసి తన తదనంతరం తన ఆస్తులు ఏవిధముగా ఎవరెవరికి చెందజేయ వలెనో తెలియ జేసిన యెడల సదరు వీలునామాను ఋజువు పరచి Letter of Administration కూడా పొందవచ్చును.

(C) వారసత్వం సర్టిఫికేటు (Succession Certificate)

Testator కు రావలసిన బాకీలు debts సెక్యూరిటీలు, బాండ్లు, డివిడెండ్లు మొదలగునవి beneficiaries వసూలు చేసికొనుటకు వీలు కల్పించు Certificate నే Succession Certificate అంటారు. హిందువులు, బౌద్ధులు, జైనులు, మహమ్మదీయులు కాని వారెవరైనా Intestate గా చనిపోయిన యెడల ఆ చనిపోయి వాని ఆస్తులకు వారసులను నిర్ధారణ చేయుచు ఇవ్వబడిన అధికార పత్రం కూడా ఇదే.

వీలునామా ద్వారా ఆస్తులను పొందగోరువారు, బాకీలు వసూలు చేసికొనెడి వారు ఈ సర్టిఫికేటు నిమిత్తం Competent కోర్టులో పిటీషను దాఖలు చేసి Certificate పొందుటకు తమ అర్హతను ఋజువు చేసి వారసత్వం సర్టిఫికేటును పొందవచ్చును.

The Indian Succession Act 1925 Chapter 10 లో దీనికి సంబంధించిన వివరములున్నవి.

Testator కు రావలసిన బాకీలు, సెక్యూరిటీలు డివిడెండ్లు రాబట్టు కొనుటకు, Intestate గా చనిపోయిన ఇండియన్ క్రిస్టియన్లకు ఏమతమునకు చెందని వారికి వారసులను నిర్ధారణ చేయుటకు ఈ సర్టిఫికేటును పొందవలసి యున్నది.

# 3 వ అనుబంధము

# వీలునామాలకు

# సంబంధించిన తీర్పులు:

# సుప్రీంకోర్టు - ఆంధ్రప్రదేశ్

# మరియు ఇతర హైకోర్టుల

# తీర్పులు

# 3వ భాగము

## వీలునామాలపై వచ్చిన తీర్పులు

### 1. విల్లును ఇతర ఆధారాలతో ఋజువు

1. వీలునామాలో సంతకంచేసిన సాక్షులు (attestors) తమ సంతకాన్ని deny చేసినా లేదా అప్పటి సంగతి స్ఫురణకు తెచ్చుకోలేకపోయిన ఇతర సాక్ష్యాధారాలతో ఆ పత్రాన్ని ఋజువు చేయవచ్చును. ఇందుకు The Indian evidence Act Section 71 ఆధారము.

section 63 of the Indian Succession Act. పై వచ్చిన తీర్పు:

చందన్ Vs. లోంగాబాయి

AIR 1998 Madhya Pradesh page 1

సాధారణముగ సంతకం చేయుగల వ్యక్తి వేలిముద్ర వేసినచో అది అనుమానాస్పదమైన పత్రం అది suspicious circumstance గా భావించాలని పై తీర్పులోనే పేర్కొనబడినది.

ఇతర సాక్ష్యాధారాలు అంటే ఏమిటనే ప్రశ్నరావచ్చును. వీలునామా యొక్క లేఖరిని సాక్షిగా తీసికొనవచ్చును.

### 2. విల్లు నిరూపణ

Testator సంతకం చేయుట సాక్షులు attestors చూడకపోయినను, సాక్షులు సంతకములు చేయుట Testator చూడకపోయినను ఆ వీలునామా రుజువు కానట్లే.

AIR 1998 Madhya Pradesh page 46

రామేశ్వర్ Vs. లాజేష్ సక్సేనా

Section 63 of the Indian Succession Act. క్రింద వచ్చిన తీర్పు గమనించునది.

## 3. విల్లును రిజిస్ట్రేషన్ చేసినంతనే విల్లు ఋజువయినట్లు కాదు

వీలునామా రిజిస్టరీ కాబడినను లా ప్రకారం దానిని ఋజువు పరచాలి. Testator సంతకం చేయుట చూచిన సాక్షులను విచారణ చేయనందున వీలునామా ఋజువు కాలేదని కర్ణాటక హైకోర్టు అభిప్రాయపడినది.

AIR 1997 Karnataka page 370 paras 34 to 37.

పార్వతమ్మ Vs. మునియప్ప తీర్పు చూచునది.

## 4. అనుమానాస్పద పరిస్థితులలో వీలునామా ఋజువు (suspicious circumstances)

వీలునామా వ్రాసిన ఆసామీ Testatrix యొక్క ఆరోగ్యము, మన స్థిమితము వ్యవహార జ్ఞానము చక్కగా ఉన్నట్లు ఋజువైతే ఆ వీలునామా proof కాబడినట్లు attestors ను పరీక్షించి Testamentary capacity establish చేసినచో ఆ testator old lady అయినను, సహజమైన వారసులకు ఏమీ సంక్రమింపజేయక పోయినను; ఆకస్మికముగ వచ్చిన వారు సాక్షి సంతకములు చేసినను అదే ప్రాంతములోని వారెవరియొక్క సంతకములు లేకపోయినను వీలునామాను అమలు జరపవలసిందేనని (హిమాచల్ ప్రదేశ్ హైకోర్టు) తీర్పు చెప్పినది.

జ్ఞాన్‌ప్రకాష్ Vs. భోలానాథ్

AIR 1997 హిమాచల్‌ప్రదేశ్ పేజీ 27 చూచునది.

## 5. వీలునామా యొక్క నిజాయితీని నిరూపించుట

సంతకానికి బదులు వేలిముద్ర వేసినను అట్లు వార్ధక్యము చేత సంతకం చేయువారు కూడా వేలిముద్ర వేయుట సహజము అనియు; వీలునామా వ్రాసిన ఆసామీ ఒక్కతెయే నివసించుచు ఇరుగుపొరుగువారికి ఆస్తిని సంక్రమింప జేయుటలో విరుద్ధమేమియు లేదనియు; అంతేకాక Testatrix యొక్క వృద్ధాప్యంలో ఇరుగుపొరుగు వారే ఆమెకు సహాయకారులుగా నిలిచినందున కూడా వారికి ఆస్తిని చెందజేయుటలో విరుద్ధమేమియు లేదనియు; Testatrix ఆమె బంధువులకు సంబంధ బాంధవ్యములు సజావుగా లేనందున ఇరుగుపొరుగు వారికి వీలునామాద్వారా ఆస్తిని సంక్రమింపజేయుట న్యాయసమ్మతమేనని సుప్రీంకోర్టుతీర్పు చెప్పినది.

AIR 1997 Supreme Court page 3819.

మిశ్రీలాల్ Vs. దౌలతీదేవి తీర్పుచూచునది.

## 6. వీలునామాపై సంతకం చేసిన సాక్షులిద్దరు (attestors) చనిపోయిన యెడల వీలునామాను ఏవిధంగా ఋజువుచెయ్యాలి?

వీలునామాపై సంతకాలు చేసిన సాక్షులిద్దరు చనిపోయినను వీలునామాను ఇతర documents ను ఋజువు పరచినట్లే proof చేయవచ్చునని మధ్యప్రదేశ్ హైకోర్టు తీర్పు చెప్పినది.

AIR 1991 M.P. page 11.

బల్వంత్ Vs. మైనాబాయి.

## 7. ప్రోబేట్ పొందుటకు కాలపరిమితి

వీలునామాను ఆధారంగా చేసుకుని ప్రోబేట్ నిమిత్తం దరఖాస్తు చేయుటకు కాలపరిమితి ఎంత? Testator చనిపోయిన మూడు సంవత్సరములు అనంతరము కూడా Probate నిమిత్తం దరఖాస్తు చేయవచ్చునా?

వీలునామాను పురస్కరించుకుని హక్కులు నిర్ధారణ చేయు విషయమై Limitation act ఏమియు deal చేయలేదనియు; Section 216 of Indian Succession Act ప్రకారం అమలు జరపాలనియు Limitation Act Article 137 వర్తించదనియు మధ్యప్రదేశ్ హైకోర్టు తీర్పు చెప్పినది.

బల్వంత్ Vs. మెయినాబాయి.

AIR 1991 Page 11.

వారసత్వం సర్టిఫికేటు ఈయబడిన అనంతరం ఆ సర్టిఫికేటును Revoke చేయమని కోరవచ్చునా?

వీలునామాను ఋజువు పరచి కోర్టు ద్వారా Succession Certificate ను పొందిన అనంతరం ఆ Proceedingsకు మరి కొంత మంది వారసులను చేర్చలేదు కాబట్టి ఈయబడిన సర్టిఫికేటును Revoke చేయమని దాఖలు చేయబడిన పిటీషను కొట్టి వేయబడినది

బ్రిజ్ బెహారీ మిశ్రా Vs. విజిశంకర్ మిశ్రా & Others

AIR 1991 Allahabad Page 236 చూచునది.

## 8. వీలునామా నిరూపణకు నిష్పక్షపాతమైన సాక్ష్యం కావాలి:

వీలునామాలో ముగ్గురు సాక్షులు సంతకాలు చేసిరి (Attestors) కాని వారిలో ఆత్మీయుడైన ఒక్క సాక్షినే విచారణ చేసి - అందుబాటులో ఉన్నా నిష్పక్షపాతమైన ఇతర సాక్షులను విచారణ చేయక పోవడం చేత వీలునామా ఋజువు కాలేదని A.P. హైకోర్టు అభిప్రాయపడినది.

అద్దేపల్లి వెంకట లక్ష్మి Vs. అయినంపూడి నరసింహారావు

AIR 1994 A.P. Page 72 D.B.

## 9. వీలునామా అసహజంగా ఉంటే (Unnatural) నమ్మక పోవుట:

వీలునామా వ్రాసినతడు Testator తనకు గల ఒకే ఒక ఆస్తి ఇంటిని తన కోడలికి మాత్రమే చెందజేయుట - తన భార్యకు మరియొక వితంతు కోడలికి మనోవర్తికి కూడా ఏమియు ఈయక పోవుట - వీలునామాను పనిమనిషి చేతికిచ్చుట మొదలగు అంశములన్నియు వీలునామా సహజమైనది కాదని (Natural) లోపించుచున్నవనియు; వీలునామాలో సంతకం చేసిన సాక్షులు Propounder కి సహాయం చేయు నిమిత్తం సాక్ష్యం ఇచ్చినట్లు కనిపించుట ఇవియన్నియు వీలునామా యదార్థమైనది కాదని చెప్పుటకే సహకరించుచున్నవని రాజస్థాన్ హైకోర్టు తీర్పు చెప్పినది.

AIR 1994 NOC 23 (RAJ)

గట్టాదేవి Vs. లడా నారాయణ్ చూచునది.

## 10. Expert opinion పొందుట:

వీలునామా ఋజావు పరచుట సాక్షియొక్క వాంగ్మూలమును ధృవపరుస్తూ గాని లేదా నిరాకరించుటకు గాని Expert యొక్క opinion తీసికొనవచ్చును.

ఇండియన్ సక్సెషన్ Act Section 63, 67 and 68.

AIR 1991 కేరళ పేజి 259 D.B.

సుమంగళT.Pai Vs. S. సుందరేశ Pai తీర్పు గమనించదగినది.

## 11. కొంతమంది వారసులకు ఆస్తి యివ్వకపోయినా విల్లు సక్రమమే:

ఈ కేసులో చిత్రమేమనగా: లేటు లాలా హరిక్రిష్ణ సింగుకు ఇద్దరు భార్యలు

వారిద్దరు అక్క చెల్లెలు కూడా ఇద్దరు అక్క చెల్లెంద్రకు స్త్రీ పురుష సంతతి కలదు: రెండవ భార్య ఆమె సంతతివారు లేటు లాలా హరిక్రిష్ణ సింగు వీలునామా వ్రాసి అందలి ఆస్తులు తమకు అనగా రెండవ భార్యకు ఆమె సంతతికి చెందజేసిరనియు సక్సెషన్ సర్టిఫికేటు నిమిత్తం దరఖాస్తు చేయగా విచారణ అనంతరం రెండవ భార్య ఆమె సంతతివారు దాఖలు చేసిన వీలునామా సరియైనదేననియు, "లా" ప్రకారం ఋజువు చేయ బడినదనియు hold చేసి సర్టిఫికేటు ఇచ్చుటకు తీర్పు చెప్పినారు. అందరుపై మొదటి భార్య ఆమె సంతతి వారు ఒరిస్సా హైకోర్టుకు అప్పీలు చేసి వారి వాదనలు వినిపించినారు. వారి వాదన ఏ విధముగ త్రోసివేయబడినది గమనించండి:

1. Testator ఇంగ్లీషులో సంతకం చేసెడి వాడు వీలునామాపై ఒరియా భాషలో సంతకం చేసినాడ నెడిది ఒక వాదన

Testator తనకు వచ్చిన ఏ భాషలో నైనా సంతకం చేయవచ్చునని తీర్పు:

Testator కు పక్షవాతం వచ్చింది. అందుచే ఆరోగ్య పరిస్థితిలో విల్లు వ్రాయలేదని వాదన. Testator వీలునామాపై సంతకం చేసినప్పుడు అతడి ఆరోగ్యం బాగానే ఉందని సాక్ష్యం వచ్చినందున అప్పెలెంట్ల వాదన తోసివేయబడింది.

మొదటి భార్యకు - ఆమె సంతతికి వీలునామా ద్వారా ఎట్టి ఆస్తియు ఈయనందున ప్రకృతి విరుద్ధంగా ఉందని (Unnatural) వాదన. మొదటి భార్య సంతతి వారు విద్యావంతులై నారనియు వారికిదివరకే స్థిరాస్తి ముట్ట చెప్పినట్లు వ్రాతమూలక ఆధారములున్నందున ఆ వాదన కూడా త్రోసివేయబడినది.

Testator సాక్షులు, లేఖరి వేరు - వేరు. Pens సిరాలు వాడినందున వీలునామా నిజం కాదని వాదన.

సంతకములు చేయువారు ఎక్కువమంది ఉంటే ఎవరి Pen వారు వాడవచ్చునని తీర్పు.

వీలునామాలో సాక్షి సంతకములు చేసిన వారు లేఖరి కూడా Testator వీలునామా అంశములు వినిన తరువాతనే సంతకం చేసినట్లు సాక్ష్యమిచ్చేరు.

పై అంశముల చేత రెండవ భార్య వారి సంతతికి వీలునామా ద్వారా ఆస్తి సంక్రమింప జేయుట సబబేనని తీర్పు చెప్పబడినది.

Radhamani Devi Vs. KadambiniDevi AIR 1995 Orissa Page 88.

## 12. వీలునామా ఋజువు పరిచే విధానం

Testator - సాక్షులు చూస్తుండగా వీలునామాపై సంతకం చెయ్యడం

సాక్షులు - Testator వీలునామాపై సంతకం చెయ్యడం చూడటం.

వీలునామాకు ముసాయిదా (Draft) ఇచ్చిన advocate కూడా సంతకం చెయ్యడం.

రుజువు అయినందున వీలునామా లా ప్రకారంవ్రాయబడి ఋజువు పరచబడిందని తీర్పు చెప్పినారు.

జమునాభాయి Vs. సురేంద్రకుమార్

AIR 1995 M.P. Page 274.

హిందువు జాయింటు కుటుంబాస్తికి వీలునామా వ్రాయవచ్చును. హిందు వారసత్వ చట్టం సెక్షను 30 చూడవలెనని తీర్పు ఈయబడినది. Expert సాక్ష్యానికి ఇతర సాక్షుల సాక్ష్యానికి తేడా ఉంటే కోర్టు ఎవరి సాక్ష్యంపై ఆధార పడాలి? Expert కు హిందీ భాష వచ్చినట్లు ఋజువు కాలేదు. అతడి Comparisons నమ్మదగినవిగా లేవు. అందుచే నమ్మదగిన సాక్ష్యం ఎటువైపు వస్తే ఆవైపు తీర్పు ఇవ్వాలని హైకోర్టు అభిప్రాయ పడింది. వీలునామా వ్రాసిన 45 రోజుల తరువాత Testator మరణించినా వ్రాసినపుడు Testator ఆరోగ్య పరిస్థితి బాగుగా ఉన్నందున ఇదియొక అభ్యంతరం కాదని తీర్పు చెప్పబడినది.

ఒక హిందువు అన్య మతస్థునికి వీలునామా ద్వారా ఆస్తి సంక్రమింప జేయవచ్చునని హైకోర్టు తీర్పు చెప్పినది.

హిందూ జాయింటు కుటుంబాలలో వాటా విల్‌పై వ్రాయవచ్చును.

## 13. సాక్షుల సాక్ష్యంలో స్వల్ప తేడాలున్నా విల్లు సక్రమమే.

రిజిస్టర్డు వీలునామా ద్వారా ఆస్తి అంతయు కుమారునికే చెందజేసి కుమార్తెలకు ఏమియు ఈయకపోయినా వీలునామా చెల్లుతుంది. సాక్షుల వాంగ్మూలాలలో ఏవేని స్వల్ప తేడాలున్నా Testatrix వీలునామా వ్రాసినట్లు ఋజువైతే దానిని అమలు జరపాలని సుప్రీం కోర్టు తీర్పు చెప్పినది.

AIR 1995 Sc పేజి 1852.

PPK. గోపాలన్ నంబియార్ Vs. PPK. బాలక్రిష్ణన్ నంబియార్ & others.

## 14. ఏదేని పత్రము సెటిల్ మెంటు దస్తావేజా? లేక వీలునామావా? దేనిని బట్టి నిర్ధారణ చెయ్యాలి?

Transfer of property act ఎక్కడా Settlement deed కు నిర్వచనం ఈయలేదు. కుటుంబ కలహాల పరిష్కారం నిమిత్తం ఈయబడిన ఆస్తి అయినా అయి యుండాలి లేదా దేవాదాయముల నిమిత్తం అయినా ఇవ్వబడాలి లేదా వివాహ సందర్భములో అయినా ఇచ్చి యుండాలి.

సెటిల్ మెంటు దస్తావేజా? వీలునామావా? అంటే బదిలీ చేయబడిన ఆస్తి వ్రాసి యిచ్చిన వారి తదనంతరం అనుభవానికి వస్తే అది వీలునామా అవుతుంది. దానికి Test? వెంటనే అనుభవింప దగినది? అయితే settlement - వ్రాసియిచ్చిన వారి తదనంతరం అయితే అది వీలునామావే. పత్రంలో వాడబడిన భాషని బట్టి (Recitals) నిర్ధారణ చెయ్యాలి.

AIR 1996 A.P. page 24 D.B. G. నరసింహులు చెట్టి Vs. S. పాండురంగయ్య చెట్టి పై కేసులో A.P. హైకోర్టు పైవిధముగ తీర్పు చెప్పినది.

## 15. ఇద్దరు attestors లో ఒకరి నే సాక్షిగా విచారణ చేస్తే వీలునామా బుజువైనట్లేనా?

వీలునామాలో సాక్షి సంతకాలు చేసిన వారిలో (attestors) ఒకరిని పరీక్ష చేసినా వీలునామా బుజువైనట్లేనని బొంబాయి హైకోర్టు తీర్పు చెప్పినది.

AIR 1996 Bombay Page 56

బందోపాంత్ సీతారామ్ బాపత్ Vs. శంకర్ సీతారామ్ బాపత్.

## 16. విల్లు సాక్షి సంతకాలు చేయుటకు ప్రత్యేక నిబంధన, form లేదు

Attestation కు ఏదైనా ప్రత్యేకమైన నమూనా గాని పద్ధతి గాని ఉన్నదా- వీలునామాలకు సంబంధించినంత వరకు?

Testator కంటె Attestorsముందుగా వీలునామాపై సంతకాలు చేసి Testator సంతకం చెయ్యడం ఆ Attestors చూచి Attestors సంతకాలు చెయ్యడం Testator చూస్తే ఆ attestation Law ప్రకారం చెల్లుతుందా?

వీలునామాను రిజిస్టరీ చేసిన సబ్‌రిజిస్ట్రారు సంతకం ఎంతవరకు ఉపయోగ పడుతుంది? Testator యొక్క ఎరుక సాక్షులు Testator సంతకం చెయ్యడం చూస్తే వారు వీలునామాను బుజువు పరచగలరా?

ఈ ప్రశ్నలన్నిటికి పై తీర్పులో రాజాస్థాన్ హైకోర్టు తీర్పు చెప్పినది.

శ్రీమతి సుదర్శన్ కౌర్ Vs. రిపుదమన్ సింగ్ & others.

AIR 1996 రాజాస్థాన్ పేజి 40: D.B.

లేటు Dr. కపూర్‌సింగ్‌కు ఇద్దరు భార్యలు శ్యామ్ కౌర్ మొదటి భార్య - సుదర్శన్ కౌర్ రెండవ భార్య. తన మొదటి భార్య సంతతి నుండి వేరుపడి రెండవ భార్యతో పిల్లలతో ఉంటూ Dr. కపూర్ సింగ్ తన ఆస్తులను తన రెండవ భార్యకు

వారి సంతతికి చెందులాగున వీలునామా వ్రాయించి, attest చేయించి, రిజిష్టరీ చేయించి కొద్ది రోజులకు మరణించినాడు.

వీలునామాపై సాక్షివ్రాలు చేసిన వారిలో ఒకరు సాక్ష్యం ఇస్తూ తాము Testator కంటే ముందుగనే సాక్షి సంతకాలు చేసినట్లు అది Testator చూచినట్లు; Testator వీలునామాపై సంతకం చెయ్యడం తాము చూచినట్లు చెప్పినారు. ఈ ముందు సంతకాలు చెయ్యడం "duly attested" అనే పదం క్రింద రాదని Single Judge of High court వీలునామా ఋజువు కాలేదని అభిప్రాయ పడినారు. ఆ తీర్పుపై ఇరువురు న్యాయమూర్తులకు అప్పీలు చేయగా attestation కు ఏదేని నిర్ణీతమైన form లేదనియు, Testator సంతకం చెయ్యడం attestors చూచినందునను, attestor సంతకం చెయ్యడం Testator చూచినందునను ఆ వీలునామా యొక్క ఇతర circumstances ని కూడా పరిగణనలోకి తీసికొని "duly proved" అని తీర్పు చెప్పినారు.Sub Registrar యొక్క Statement కూడా పరిగణనలోనికి తీసికొనవచ్చని ఎరుక సాక్షుల (Identifying witness) యొక్క సాక్ష్యాలు కూడా వీలునామాను ఋజువు పరచడంలో పరిగణన లోనికి తీసికొన వచ్చని ఇద్దరు న్యాయ మూర్తులు అభిప్రాయ పడినారు. వారి తీర్పును సమర్థించు కొనుటకు ఈ దిగువ వ్రాయబడిన సుప్రీం కోర్టు తీర్పులను ఆధారంగా తీసికొన్నారు.

(a) AIR 1959 Sc. పేజి 443.

(b) AIR 1962 Sc. పేజి 567.

(c) AIR 1964 Sc. పేజి 529.

## 17. వారసుల్లో ఒకరికి మాత్రమే ఆస్తి యిచ్చినా విల్లు సక్రమమే

తల్లి దండ్రులు పలువురిలో ఒకే కుమారునికి ఆస్తి సంక్రమింప జేస్తూ వీలునామా వ్రాస్తే - ఆ కుమారునికి వాని భార్యకు మాత్రం ఆస్తి సంక్రమింప జేయడం అస్వాభావికం (Unnatural) అవుతుందా? వారిద్దరి వద్దనే తల్లి దండ్రులు చిరకాలం నుండి ఉంటున్నారు గనుక వారి సంరక్షణలో ఉన్నారు గనుక

అస్వాభావికం అవదు. తండ్రి అనారోగ్యంగా ఉన్నను Cataract తో ఉన్నను తల్లి అస్వస్థతతో ఉన్నా వారి మానసిక ఆరోగ్య పరిస్థితి బాగున్నందున వారిద్దరు Immobile కానందున Senile కానందున వారు వ్రాయించిన వీలునామా చెల్లుబాటు అవుతంది. కుమార్తెకు పెండ్లి సమయంలో స్త్రీ ధనం ఇచ్చినందున వీలునామా Unconscionable కాదు అని కేరళ హైకోర్టు తీర్పు ఇచ్చినది.

AIR 1996 Kerala Page 64 D.B. P. సుబ్రహ్మణ్యం Vs. రామచంద్రన్ తీర్పు చూచునది.

## 18. వీలునామా ఏ భాషలో వ్రాయాలి?

వీలునామా ఇంగ్లీషులో గాని ప్రాంతీయ భాష (Vernacular) లో గాని వ్రాయవచ్చు. అందలి పదజాలమునకు సరియైన అర్థము చెప్పవలసియున్నది.

ఒక Testator తన స్థిరాస్తిని తన తదనంతరం తన భార్యకు absolute హక్కులతో సంక్రమింపజేసి తన ముగ్గురు కుమాళ్ళు కలిసి యుండి తల్లి అనురాగానికి పాత్రులైతే వారికి తల్లి తదనంతరం చెందవలెనని వీలునామాలో వ్రాయించినాడు. అయితే భార్యకు సర్వహక్కులు ఇచ్చినట్లా? లేక జీవితకాలం అనుభవం హక్కు కల్పించినట్లా? అంటే సర్వహక్కులు ఇచ్చినట్లేనని ముంబాయి హైకోర్టు తీర్పు చెప్పినది.

AIR 1996 Bombay Page 56. బందోపాంత్ సీతారామ్ బాపత్ Vs. శంకర్ సీతారామ్ బాపత్ తీర్పు చూచునది.

## 19. దావాల్లో - విల్లును బట్టి వారసులను చేర్చుట

వీలునామా యొక్క genuineness ను వారసత్వ నిర్ధారణ వ్యవహారంలో అనగా వాది యొక్క గాని ప్రతి వాది యొక్క గాని వారసులెవరో నిర్ణయించే Order 22 Rule 5 of C.P. Code proceedings లో final గా నిర్ణయించ నక్కర్లేదు. దానికి Probate proceedings కు వదలి వేయవచ్చును. వారసులను నిర్ణయిస్తూ ఇవ్వబడిన తీర్పు final కాదు. మరియు ఆ తీర్పు Res Judicata అవదు.

AIR 1996 MP. page 13 చూచునది.

పైతీర్పులో AIR 1981 P&H page 130 FB తీర్పును అనుసరించినారు.

## 20. విల్లు నిరూపణలో సాక్షులు

రిజిస్టర్డు వీలునామాను ఋజువు పరచడంలో సాక్షుల వాంగ్మూలాలలో తేడాలున్నా రిజిస్టరీ చేసిన సబురిజిస్ట్రారు endorsement ఉంటే ఆ వీలునామా ఋజువైనట్లే ననియు కుమార్తెకు ఏమి ఆస్తి ఈయక అంతా కుమారునికే చెందజేయడంలో అస్వాభావికం ఏమీలేదని సుప్రీంకోర్టు తీర్పు చెప్పినది.

AIR 1995 Sc. page 1852 గోపాలన్ నంబియార్ Vs. బాలక్రిష్ణన్ నంబియార్ తీర్పు చూచునది.

## 21. సక్సేషన్ సర్టిఫికేట్ - వారసులందరికీ యిచ్చుట

Succession Act section 373 ప్రకారం వారసత్వం సర్టిఫికేటును ఒకరి పేరుతోనే ఈయాలని నియమంలేదు. హక్కుదారులెంత మంది (Claimants) ఉంటే అంతమంది పేరుతో Joint Succession Certificate ఈయవచ్చునని పంజాబ్ హైకోర్టు తీర్పు చెప్పినది. శాంతి Vs. పంకజ్

AIR 1995 P&H Page 14 చూచునది.

వీలునామాలోని క్లాజుల Interpretation Section 88 Succession Act..

AIR 1995 సుప్రీంకోర్టు పేజి 2491.

## 22. వీలునామాలోని అంశాలలో తేడాలు ఉంటే చివరి క్లాజు ఖాయమగును.

K. అంబూని Vs. H.Ch. భాంద్రీ. AIR 1995 S.C. page 2491

ఏదేని వీలునామాలో చాలా క్లాజులుండ వచ్చును. మొదటి క్లాజులలో

వ్రాయబడినవి తరువాత వ్రాయబడిన క్లాజులకు లేదా పేరాలకు తేడాలుండ వచ్చును (Inconsistant). అప్పుడు దేనిని గ్రహించాలి? ఏక్లాజు విడనాడాలి? అన్న సందేహం వస్తే మొదటి క్లాజులు లేదా మొదటి పేరాలలో వ్రాయబడిన వాటిని విడనాడి తరువాతి క్లాజులలో గాని పేరాలలో గాని వ్రాయబడిన వాటినే అమలు జరపాలి (Later shall prevail) అని సుప్రీంకోర్టు తీర్పు చెప్పినది. సుప్రీంకోర్టు All England Report లోని వాక్యాలను ఉటంకించినది.

If in a will there are two inconsistent provisions, the latter shall prevail over the earlier)

Hammond Vs. Trelane

(1938) 3 All E.R. Page 308.

## 23. వీలునామా రిజిస్ట్రేషన్ చేయకపోతే శంక అక్కర్లేదు.

వీలునామా రిజిస్టరీ కానంత మాత్రాన అనుమానించనవసరంలేదు. అది Suspicious circumstance అవదు.

వీలునామా పద్ధతి ప్రకారం వ్రాయబడి సాక్షి సంతకములు చేయబడి ఉంటే ప్రోబేటుకు దరఖాస్తు చెయ్యడం ఆలస్యం అయినా చెల్లకపోదు - ఆలస్యం అనుమానానికి దారి తీయదు.

వీలునామా అన్ని పేజీలు సంతకాలు చేయబడక పోయినా చివరి పేజీ సంతకం చేయబడి ఉండి రుజువైతే వీలునామా చెల్లుబాటు అవుతుంది.

కుటుంబ సభ్యులందరికి ఆస్తి సంక్రమింపజేయడం అస్వాభావికం కాదు. (Unnatural అవదు.)

Succession Act Section 63.

అమ్ము బాలచంద్రన్ Vs. O.T. జోసఫ్

AIR 1996 Madras Page 442 D.B. పై తీర్పు చూచునది.

## 24. ప్రొబేటుపై విచారణ విధానం

Grant చేయబడిన Probate ను Revoke చేయమని కోరుచు దాఖలు చేసిన petition దావా (Suit) క్రింద మార్పు చేయుటకు వీలు లేదని పిటీషన్ వలెనే విచారణ జరిగించాలని సుప్రీంకోర్టు అభిప్రాయ పడినది.

AIR 1997 Sc. page 1055. పై తీర్పు చూచునది.

## 25. వృద్ధులు - విల్లు వ్రాయవచ్చును

వీలునామా వ్రాసినామె వృద్ధురాలైనంత మాత్రాన దగ్గరి వారసులకు వీలునామా ద్వారా ఏమీ ఈయనంత మాత్రాన సాక్షులు ఆకస్మికంగా వచ్చి సాక్షి సంతకాలు చేసిన కారణం చేతను (Chance witnesses) అదే ప్రాంతములోని సాక్షులను సాక్ష్యం వేయక పోయినంత మాత్రాన వీలునామా చెల్లకపోదు. పద్ధతి ప్రకారం వీలునామా వ్రాయబడి, attest చేయబడి, రిజష్టరీ కాబడినందునను - వీలునామా వ్రాసిన తరువాత 7 1/2 సంవత్సరాల వరకు వీలునామా వ్రాసిన ఆమె జీవించి యున్నందునను వీలునామా చెల్లుబాటు అవుతుందని హిమాచల్ ప్రదేశ్ హైకోర్టు తీర్పు చెప్పినది.

జ్ఞాన్ ప్రకాష్ Vs. భోలానాథ్

AIR 1997 H.P. Page 27 తీర్పు చూచునది.

## 26. రిజిష్టర్డు వీలునామా నిరూపణ

రిజిస్ట్రారు ఎదుట Testator తాను వీలునామా వ్రాసినట్లు ఒప్పుకుంటే ఎఱుక సాక్షులు (Identifying witnesses) కూడా అదే విధంగా సాక్ష్యం ఇస్తే పద్ధతి ప్రకారం వ్రాయబడి attest చేయబడినట్లు భావించవచ్చును.

వీలునామాలో సాక్షివ్రాలు చేసిన ఆసామీయే లేఖరి (Scribe) కూడా అయినను attesting witness కాకపోడు.

ఎక్కడ సాక్షి(వాలు చేశారన్నది ముఖ్యంకాదు. ఒక సాక్షి సంతకం చేయడం మరియొక సాక్షి చూడకపోయినా వీలునామా validity కి భంగం రాదు.

K.M. వర్ఘీస్ Vs. K.M. ఊమెన్

AIR 1994 కేరళ పేజి85 D.B. పై తీర్పు చూచునది.

## 27. వీలునామా - నిరూపణ కాకపోవుట

వీలునామా వ్రాసిన రోజునే Testatrix మరణించుట; ముగ్గురు సాక్షులు వీలునామాపై సంతకం చేయుగా Propounder కి సన్నిహితుడైన సాక్షిని ఒక్కరినే విచారణ చేయుట అనుమానాస్పదమైనవిగా పరిగణింపబడి వీలునామా పద్ధతి ప్రకారం వ్రాయబడ లేదనియు మరణం ఆసన్న మైన వ్యక్తి సహజంగా మానసిక శక్తి కోల్పోవుననియు నిర్ణయించి వీలునామా చెల్లనేరదని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు తీర్పు చెప్పినది.

AIR 1994 A.P. page 72 DB

అద్దేపల్లి వెంకట లక్ష్మి Vs. అయినంపూడి నరసింహారావు పైతీర్పు చూచునది.

## 28. వీలునామా నిరూపణ కాకపోవుట

వీలునామాలో సంతకం చేసిన సాక్షులు Testator సంతకం చెయ్యడం లేదా వేలి ముద్ర వెయ్యడం చూడక పోయినను - Testator తానే వీలునామాపై సంతకం చేసినట్లు సాక్షుల వద్ద ఒప్పుకోక పోయినను (acknowledge) ఆ వీలునామా ఋజువు కానట్లే నని A.P. హైకోర్టు తీర్పు చెప్పినది.

M. రత్న Vs. K. నవనీతమ్

AIR 1994 A.P. పేజి 96 చూడదగినది.

## 29. executor గా ఉండేందుకు అంగీకరిస్తేనే executor కి ఆస్తి దఖలు పడేది

వీలునామాలో పేర్కొనబడిన executor or executtrix కు వీలునామలో చెప్పబడిన ఆస్తి ఎప్పుడు దఖలుపడును? వీలునామాలో పేర్కొనబడిన executor లేదా executrix సదరు office ను అంగీకరించినంతనే దఖలు పడును vest అగును. అయితే ఎప్పటినుండి? testator మరణించినంతనుంచి సదరాస్తి executor కు Management నిమిత్తం దఖలు పడును. సుందర నరసాయమ్మ Vs. ఆంధ్రా బ్యాంకు 1960 (1) An WR పేజి 234 D.B. తీర్పు చుచునది.

## 30. సైనికుల వీలునామా : Privileged Will

సైనికులు, నావికులు, వైమానిక దళానికి చెందిన ఆసామీలు యుద్ధ సమయంలో వ్రాసిన వీలునామాను privileged వీలునామా అంటారు. అయితే మిలిటరీ ఆఫీసర్లు kindred roll లో వ్రాయబడిన అంశాలను వీలునామా క్రింద పరిగణించవచ్చునా?

kindred roll లో వ్రాయబడిన అంశాలు privileged వీలునామా క్రిందకు రావు అని A.P హైకోర్టు తీర్పు చప్పింది. 1957(1) An W.R. పేజి 128 రత్నమ్మాళ్ Vs. తేలమ్మాల్ తీర్పు చూచునది.

## 32. విల్లుపై సంతకం చేయగలిగినా వేలిముద్ర వేసినా సక్రమమే:

testatrix వీలునామాపై వేలిముద్ర వేసినను - సంతకం చేయగల్గినదే అయినను వీలునామా పద్ధతి ప్రకారం వ్రాయించితే చెల్లుబాటు అవుతుంది.

testatrix ఆస్తులు ఎవరికి సంక్రమింపజెయ్యాలో చెప్పవలసిన పూచీ కోర్టుకు లేదు. ఆరోగ్యవంతులుగా ఉండి వ్యవహార జ్ఞానంతో వీలునామా వ్రాయించి సంతకం గాని వేలిముద్రగాని వేసి సాక్షి సంతకాలు చేయించితే ఆ వీలునామా చెల్లుబాటు అవుతుంది.

సుశీల బాలసాహ Vs. సరస్వతి మొండల్

AIR 1991 Calcutta page 166 DBపై తీర్పు చూచునది.

## 33. Testator సంతకం చేయడం చూడక విల్లుపై అతని అంగీకారం పొందనిచో విల్లు సక్రమంకాదు:

హనుమంతరావు అను రిటైర్డు IAS ఆఫీసరు వీలునామా ద్వారా తన రెండవ భార్య అయిన రత్నకు తన యింటిని సంక్రమింపజేసినాడు. మొదటిభార్య నవనీతం ఆ వీలునామా చెల్లదని సవాలు చేసినది. మొదటి భార్యతో గల వివాహ సంబంధము రద్దు కాకుండానే రెండవ పెండ్లి 1961లో చేసికొనినందున రత్నకు భార్యగా status లేదని మొదటి భార్య వాదించినది. అయితే రెండ భార్య అని రత్నను describe చేసినా persona designata గా ఆమెకు అధికారం ఉందని హైకోర్టు అభిప్రాయపడినది.

అయితే హనుమంతరావు వ్రాసిన వీలునామాలో సాక్షి సంతకములు చేసిన ఇద్దరు సాక్షులు తాము హనుమంతరావు సంతకం చెయ్యడం చూడలేదనియు, సదరు వీలునామపై హనుమంతరావు సంతకం చేసినట్లు తమకు acknowledge చేయలేదని సాక్ష్యం చెప్పినారు. అందుపై హనుమంతరావు వ్రాసిన వీలునామా ఋజువుకాలేదని A.P. హైకోర్టు తీర్పుచెప్పినది.

AIR 1994 A.P పేజి 96

M. రత్న Vs. K. నవనీతం తీర్పు చూచునది.

## 34. వీలునామా ద్వారా-సంపూర్ణ హక్కులు, జీవితకాల అనుభవం భార్యకు యిచ్చుట:

vested interest అంటే సుప్రీంకోర్టు ఇలా చెప్పింది "An interest is said to be vested interest when there is immediate right of present enjoyment or a present right for future enjoyment".

"contingent interest" అంటే "An interest is said to be contingent if the right of enjoyment is made dependant upon some event or condition which may or may not happen" on the happening of the event or condition a contingent interest becomes vested interest."

వీలునామా ద్వారా సంక్రమింపజేసిన ఆస్తి తన తదనంతరం తన భార్య అనుభవించి ఆమె జీవితానంతరం తనకుమారులు సర్వహక్కులతో అనుభవించి ఆమె జీవితానంతరం తనకుమారులు సర్వహక్కులతో అనుభవించవలెనని వ్రాయబడినంతమాత్రాన కుమాళ్ళకు సదరింటియందు vested హక్కు రాకపోదు. testator మరణించినంతనే హక్కు vest అగును. enjoyment postpone కావచ్చును.AIR 1996 SC పేజి 2260 ఉషా సుబ్బారావు Vs. విశ్వేశ్వరయ్య తీర్పుచునది.

## 35. వీలునామా - ఋజువు పరచువిధానం

అసలు వీలునామా (original will) పోయినందున నకలు దాఖలు చేసి వీలునామాను injunction దావాలో secondary evidence ద్వారా ఋజువు చేయుట law కి విరుద్ధము.

Injunction దావాలో కాక probate proceedings లో క్రమ పద్ధతి ప్రకారమే వీలునామాను ఋజువు పరచాలని సుప్రీం కోర్టు తీర్పు చెప్పినది.

AIR 1996 SC. పేజి 1807

టి. వెంకటనారాయణ Vs. వెంకట సుబ్బమ్మ తీర్పు చూచునది.

## 36. పంపకంలో వచ్చిన ఆస్తి - భార్యకు యిచ్చుట

ఒక testator తన అన్నదమ్ములతో ఆస్తి పంచుకుని తన వాటాకు వచ్చిన ఆస్తిని తన 40వ ఏట తన భార్యకు వీలునామా ద్వారా సంక్రమింపజేసినాడు. వైవాహిక జీవితం 9 ఏళ్ళు అయినా తనకు సంతతి కలగలేదనియు, తాను

తరుచుగా రైలు, బస్సు, లారీలలో ప్రయాణాలు చేయవలసి యుండుటచేతను అందుచే ఏదైన ప్రమాదమునకు గురికావలసి వచ్చుననియు వీలునామాలో వ్రాయించినాడు. వీలునామా పద్ధతి ప్రకారం వ్రాయబడి సాక్షులు, దస్తూరీ వేసిన వారి ద్వారా ఋజువు కాబడింది. ఇందు unnatural గా చెప్పబడే అంశములేవియు లేవనియు వీలునామా అమలు జరుగుతుందని Madras High Court తీర్పు చెప్పింది.

AIR 1989 Madras పేజి 185 చిన్నమ్మాళ్ Vs. కన్నగి & others తీర్పు చూచునది.

## 37. వీలునామాపై - జీవితకాలం హక్కు

ఒక Testator వీలునామా వ్రాయించి తన ఆస్తులపై వచ్చు ఆదాయం తన జీవితాంతము వరకు తానున్ను తన తదనంతరం తన భార్య ధనలక్ష్మి జీవితాంతం ఆదాయం అనుభవించవలెననియు వీరిద్దరి తదనంతరం తమకుమార్తె రాజ్యలక్ష్మి సర్వహక్కులతో సదరాస్తులను అనుభవించి ఆమె తదనంతరం ఆమె మగ సంతతి వారికి చెందవలెనని వ్రాసినాడు. సదరు రాజ్యలక్ష్మికి సదరు వీలునామా ద్వారా జీవితకాలపు హక్కేనా? లేక సర్వహక్కులు సంక్రమించేయా? అంటే సదరు రాజ్యలక్ష్మికి జీవిత కాలపు హక్కు మాత్రమే వీలునామా ద్వారా సంక్రమించిందని సుప్రీంకోర్టు తీర్పు చెప్పినది.

ఎస్. రాజగోపాల్ చెట్టియార్ Vs. హంసవేణి అమ్మాళ్

AIR 1992 SC పేజి 704 చూచునది.

## 38. వీలునామా నిరూపణకి - సాక్షుల విచారణ తప్పనిసరి

తండ్రి కుమాళ్ళు కలసి హిందు జాయింటు కుటుంబముగ మెలగుతూ వ్యాపారం చేసి ఆస్తులు సంపాదించితే అవి జాయింటు కుటుంబ ఆస్తులే అవుతాయి. తండ్రి వ్రాసిన వీలునామా రిజిస్టరీ అయినా, సాక్షులు జీవించి ఉన్నా

వారి సాక్ష్యం చెప్పించకపోవడం వలన వీలునామా పద్ధతి ప్రకారం ఋజువుకానట్లే భావించవలెనని A.P హైకోర్టు తీర్పు చెప్పింది. Income Tax assessment proceedings లో వీలునామా ప్రసక్తి వచ్చి admission ఉన్నా ఆ admission ఆస్తుల పంపకం దావాలో ఉపయోగపడదని A.P హైకోర్టు తీర్పు చెప్పింది.

పురన్‌బాయి Vs. రణఛోడ్‌దాస్

AIR 1992 A.P page 270 D.B.

## 39. ప్రొబేటు యిచ్చుట

ఒక వీలునామా వ్రాయబడిన 16 సంవత్సరముల అనంతరం Probate నిమిత్తం కోర్టులో దాఖలు చేయబడినది. సదరు వీలునామా ద్వారా ఆస్తిని తన మైనరు కుమారునికి సంక్రమింపజేసి మరణించినాడు. మరియొక పంపకం దావాలో కమీషనరు వ్రాసినపుడు కూడా వీలు బయలు పడలేదు. తాను వెతుకుతుండగా సదరు వీలునామా బయట పడిందని చెప్పిన సాక్ష్యం convincing గా ఉందని వలన వీలునామాకు భంగం లేదని తీర్పు చెప్పబడింది. Testator ఆరోగ్యంగాను, వ్యవహార జ్ఞానంతో వీలునామా వ్రాయించినట్లు సాక్ష్యం వచ్చినందున Testator యొక్క ఆరోగ్యాన్ని నిర్ధారణ చేయుటకు పరీక్ష చేయనవుసరం లేదని పద్ధతి ప్రకారం వీలునామా వ్రాయబడి, ఋజువు చేయబడినదని ఒరిస్సా హైకోర్టు తీర్పు చెప్పినది.

విష్ణు ప్రియ మొహపాత్ర Vs. బాలక్రిష్ణ మొహపాత్ర

AIR 1993 Orissa page 218 తీర్పు చూచునది.



## 40. సాక్షులు లేకుంటే - విల్ చెల్లదు- రిజిస్ట్రేషన్ చాలదు

విల్‌పై సాక్షి సంతకాలు లేకపోతే - విల్‌పై సబ్ రిజిస్ట్రార్ తన ఎదుట Testator సంతకం చేసినాడని ఎండార్స్‌మెంట్ వ్రాసినా విల్ చెల్లదు.

94 (3) A LT 12

## 41. విల్ ద్వారా - మనవలకు ఆస్థి

తన అనంతరం మనవలకు ఆస్థి చెందాలని విల్‌లో వ్రాస్తే - Testator మరణించిన నాటికి పుట్టిన వారికే ఆస్తి వస్తుంది. అనంతరం పుట్టిన వారికి రాదు.

A. నారాయణ Vs. C.I.T మద్రాసు

C.A 733 to 740/65, AIR- 1967 S.C.433

## 42. స్పెషల్ ఫేమిలీ ఫెంక్షన్‌ని విల్ ద్వారా యివ్వరాదు

ఇండియన్ ఎయిర్ ఫోర్సు రెగ్యులేషన్ 74 ద్వారా యివ్వబడే స్పెషల్ ఫేమిలీ పెంక్షన్ వితంతు భార్యకు చెందును. దానిని విల్‌పై యివ్వరాదు.

జోధ్‌సింగ్ Vs. యూనియన్ ఆఫ్ ఇండియా SLP 254/80, 1980 S.C 306.

## 43. విల్‌లోని అంశాలనుబట్టి Executor నిర్ధారణ

విల్‌లో 'ఎక్జిక్యూటర్' అనే పదం ఉపయోగించకపోయినా విల్‌లోని అంశాలనుబట్టి - విల్‌లోని అంశాల అమలుకు Testator ఎవరిపైన బాధ్యత ఉంచునో వారు Executor అవుతారు.

ఎస్. రామారావు Vs. G. Kamalamma 93 (1) ALT 696

## 44. విల్లు - సాక్షులు

విల్‌లో సాక్షులు... విల్ వ్రాసిన వ్యక్తి సంతకం చేయడం వారు చూసినట్లు అతని సమక్షంలో వారు సాక్షి సంతకాలు చేసినట్లు నిరూపణ చెయ్యాలి.

గిరిజాదత్‌సింగ్ Vs. గంగోత్రిదాస్ C.A. 194, 195/53, AIR 55 S.C 346

## 45. విల్‌పై - కుమార్తెకు పరిమిత హక్కులు

విల్లు వాస్తవమా కాదా అనేందుకు తీర్పుల సహాయంతో కాక ఆ విల్లు వ్రాసిన ప్రత్యేక పరిస్థితులను పరిగణించి విల్లును పరీక్షించాలి. విల్ వ్రాసిన వ్యక్తి తన కుమార్తెకు జీవిత

హక్కు, ఆమె సంతతికి సంపూర్ణ హక్కులు యిస్తే - కుమార్తెకు పరిమిత హక్కులు మాత్రం వస్తాయి.

రామచంద్ర షెనాయి Vs. హిల్డాబైట్ AIR 64 S.C 1323 C.A 452/59

## 46. విల్‌పై ఆంధ్రప్రదేశ్‌లోని ఆస్తులు పొందుటకు -ప్రొబేట్ అవసరంలేదు

హిందువులు వ్రాసిన విల్స్ ద్వారా ఆంధ్రప్రదేశ్‌లోని ఆస్తులు పొందుటకు ప్రొబేట్ పొందనక్కర్లేదు.

యమ్. నారాయణ Vs. యమ్. సూర్యకాంతం
1997 (5) ALT 459 , CRP 1646/97

## 47. విల్ నిరూపణలో ముఖ్యాంశాలు

Testator మంచి వ్యక్తతతో (sound and disposing state of mind) విల్ వ్రాసినట్లు - అదే అతని ఆఖరి విల్ అని నమ్మదగిన సాక్ష్యాలతో నిరూపించాలి.

పి. శేషమ్మ Vs. పి. కృపాసాగర్ 1997 (2) ALT 182.

## 48. కోర్టుకి సెక్యూరిటీ (హామీ యిస్తే) వారసుల మధ్య వివాదం ఉన్నా సక్సెషన్ సర్టిఫికేట్ యిచ్చుట

వారసుల మధ్య వివాదం ఉన్నా కోర్టుకి హామీ యిస్తే Prima Facie హక్కు కలవార్కి సక్సెషన్ సర్టిఫికేట్ యివ్వవచ్చును.

ఎ. శ్రీధర్ Vs. ఎ. ఆదివరలక్ష్మి. 1996 (2) ALT 890

## 49. విల్‌లోని చివరి క్లాజులను అమలు పరచుట

విల్‌లోని క్లాజులలోని అంశాలలో పరస్పర విరుద్ధంగా ఉంటే - విల్‌లోని చివరి క్లాజులోని అంశాలను అమలు పరచాలి.

కె. అంబానీ Vs. హెచ్. గణేష్ భండారీ 1995(3) CCC 362.

## 50. విల్‌కు - సెటిల్‌మెంట్ డీడ్‌కు తేడా

ఆస్తిలో వెంటనే హక్కు కల్పిస్తే అది సెటిల్‌మెంట్ డీడ్ అవుతుంది. ఆస్తి స్వాధీనం యిచ్చినా జీవితానంతరమే హక్కు కలగాలని డాక్యుమెంట్‌లో ఉంటే అది విల్ అవుతుంది.

జి. నరసింహులు చెట్టి Vs. యస్. పాండురంగయ్య 1995(3) ALT 193.

## 51. కొందరు వారసులకే ఆస్తి యిచ్చినా విల్ సక్రమమే

విల్ ద్వారా హక్కు పొందేవారు విల్ వ్రాయడంలో ప్రముఖ పాత్ర వహిస్తే - విల్ పైగల అనుమానాలను నివృత్తి చెయ్యాలి. విల్‌పై కొంతమంది వారసులకే ఆస్తి యిచ్చినా విల్ సక్రమమే.

ఇందుబాలాబోస్ Vs. మణీంద్రచంద్రబోస్

C.A. 1872/70; 1982 (1) S.C.C. 20.

## 52. విల్ వ్రాసిన వ్యక్తి మేజరు అని నిరూపించాలి

విల్‌పై ఆధారపడి ఆస్తి కోరేవారు విల్ వ్రాసే సమయానికి విల్ వ్రాసినవారు మేజరు అని నిరూపించాలి.

C.A. 129/1965, A.I.R : 1968, S.C.147.

## 53. విల్‌పై సందేహాలను నివృత్తి చేసే బాధ్యత

వాటాదార్లలో ఒకరికి ఎక్కువ ఆస్థి యిస్తే, విల్ వ్రాయించడంలో అతను ప్రముఖ పాత్ర వహిస్తే - విల్ వాస్తవికతపై శంక కలుగును. విల్ పై ఆస్తి కోరేవారు కోర్టుకి కలిగే సందేహాలను నివృత్తి చెయ్యాలి.

జి. తాతయ్య Vs. టి.వి సుబ్బయ్య C.A. 431/65: AIR 1968 S.C. 1332.

## 54. జీవితకాలపు హక్కు - అనంతర హక్కు

జీవితకాలపు హక్కుదార్ల వాటాలను విల్‌లోని షరతుల ప్రకారం వారసులు - జీవితకాలపు హక్కుదార్ల జీవితానంతరం ఎవరి వాటాదారు వారసులు వారి (జీవితకాలపు హక్కుదారి) వాటాలో భాగం తీసుకుంటారు. C.A. 245/65, 1968 S.C. 75.

## 55. సొమ్ముబాకీ వసూలుకై పెండింగ్‌లో ఉన్న దావాలో E.P. లో వారసులను చేర్చుట

పెండింగ్‌లో ఉన్న దావాలో మరణించిన వారి వారసులుగా చేర్చుటకు సక్సెషన్ సర్టిఫికేట్ అవసరం లేదు.

63 (2) ALT 115; 63 (2) ANWR 245; 62 (2) ALT 738; 62 (2) ANWR 199.

## 56. హిందూ అవిభక్త కుటుంబం బాకీల వసూలు

H.U.F. (హిందూ జాయింటు కుటుంబం) కు రావలసిన బాకీల వసూలుకి సక్సెషన్ సర్టిఫికేట్ అక్కర్లేదు. 73 (2) APLJ-56.

## 57. విల్‌లోని సాక్షులు ఎదురు తిరిగితే విల్ నిరూపణ విధానం

విల్‌లోని సాక్షులు ఎదురు తిరిగితే వారిని క్రాస్ పరీక్ష చేయడం ద్వారాను, ఇతర ఆధారాలతో విల్ నిరూపణ చెయ్యాలి.

75 (2) APLJ - 364.

## 58. సక్సెషన్ సర్టిఫికేట్‌కై వేసిన పిటీషన్ వ్యవహారంలో III Party చేరుట

సక్సెషన్ సర్టిఫికేట్ వ్యవహారం C.P.C. (సివిల్ ప్రొసీజర్ కోడ్) అనుసరించి చెయ్యాలి. సక్సెషన్ సర్టిఫికేట్ యిచ్చే విషయంపై అభ్యంతరాలు కలవారిని పార్టీగా చేర్చవచ్చును.

విష్ణుకుమార్ Vs. భవరి బాయి 1979 (1) ALT - 272.

## 59. మోటార్ Accident Claim కేసుల్లో సక్సెషన్ సర్టిఫికేట్ కోరుట

కోర్టుకి అవసరం అని తోచినచో మరణించిన వాని Dependents, Insurance సొమ్ము తీసుకునేందుకు సక్సెషన్ సర్టిఫికేట్ దాఖలు చేయాలని కోరవచ్చును.

1992 (1) ANWR - (NOC) P - 35.

## 60. డిక్రీ హోల్డరు మరణిస్తే - వారసులు సక్సెషన్ సర్టిఫికేట్ దాఖలు చేస్తేనే డిక్రీ అమలు

డిక్రీహోల్డరు మరణించేనాటికి డిక్రీ అమలుకై పిటీషన్ పెండింగ్‌లో లేనిచో E.P. వేసి డిక్రీ అమలుకు సక్సెషన్ సర్టిఫికేట్ పొందాలి.

K. గోపయ్య Vs. D.V. రావు
92(1) ALT (NOC) -11.

---

| | | |
|---|---|---|
| S.C. | = | Supreme Court |
| S.C.C. | = | Supreme Court Cases |
| AIR | = | All India Reporter |
| ALT | = | Andhra Law Times |
| APLJ | = | Andhra Pradesh Law Journal |

# రెండవ ముద్రణ తేదీ నాటికి వచ్చిన సుప్రీం కోర్టు - A.P. హైకోర్టు తీర్పులు:

**విల్ ద్వారా - కుమార్తెకు - ఆస్తిలో జీవిత హక్కు:**

పై కేసులో తండ్రి వీలునామా వ్రాసి తన వితంతు కుమార్తెకు తన ఆస్తిలో 1/3వ వంతు వాటా ఆస్తిని ఆమె జీవిత కాలం అనుభవించుటకు - ఆమె అనంతరం సదరాస్తి తన అన్నదమ్ములకు చెందవలెనని వీలునామా వ్రాసి తండ్రి మరణించెను. తండ్రి మరణానంతరం వితంతు కుమార్తె హిందు వారసత్వ చట్ట ప్రకారం తనకే తండ్రి ఆస్తి అంతయు సంక్రమించాలని వితంతు కూతురు తగవు పరచినది. అందుపై సుప్రీంకోర్టు తీర్పు ఇస్తూ ఆమె తండ్రి intestate గా మరణించలేదు గనుక వీలునామా ప్రకారమే అమలు జరగాలని తీర్పు ఇచ్చినది.

2000 (4) ALD.36 (SC) సుప్రీంకోర్టు:
బల్వంత కౌర్ & others Vs ఛన్నసింగ్ & others:

**విల్లు చెల్లుబాటు నిర్ధారణ :**

ఆస్తిపై హక్కులు నిర్ధారణ చేసి కొనుటకు వీలునామా చెల్లుబాటు విషయం (Validity of the will) ముందుగా తేల్చు కోవాలని Probate కావాలా? అక్కర్లేదా? అన్న విషయం ముఖ్యం కాదని A.P. హైకోర్టు తీర్పుచెప్పినది.

2000 (3) ALD.759 (D.B.)
లలిత శంకర్ నారాయణ్ Vs రోహిణి.

**సక్సెషన్ సర్టిఫికెట్ పొందే విధానం :**

వారసత్వపు సర్టిఫికెట్ నిమిత్తం O.P. దాఖలు చేస్తే ఆప్రాంతంలో విశేష ప్రచారం గల దినపత్రికలో నోటీసు ప్రచురణ చెయ్యాలి. అంతేగాని మొక్కుబడికి ఏదో పత్రికలో వేశాంలే అంటే చాలదు.

2000 (3) ALD.228 (D.B.)

A.K హరిగోపాల్ Vs బాలాజీ సింగ్

**పెండింగ్ దావాలో వారసులను అందరినీ చేరిస్తే సక్సెషన్ సర్టిఫికెట్ అక్కర్లేదు :**

ఏదేని దావాలో మృతి చెందిన పార్టీ యొక్క వారసులందరు చేర్చబడిన యెడల - మరల వారసత్వం సర్టిఫికేటు పొందవలసిన అగత్యం లేదు.

2000 (4) ALD.310.

S. సతీష్ ట్రేడర్స్ **Vs** A. ఆంజనేయులు.

## వారసత్వం (సక్సెషన్) సర్టిఫికేటు పొందుటకు అనుసరించ వలసిన రూల్సు

A.P. లో Probate మరియు Letters of Administration పొందవలసిన అగత్యం లేదు. అందుచే వాటికి సంబంధించిన రూల్సు తొలగించి మిగిలినవి మాత్రమే ప్రచురించడమైనది.

## RULES UNDER THE INDIAN SUCCESSION ACT, 1925

*Testamentary and intestate matters*

## APPLICATION FOR SUCCESSION CERTIFICATE:

**13. Application for succession certificate :** An application for a succession certificate shall be by original petition, in Form No.9.

**13-A. Person Applying for the Grant of Succession Certificate on behalf of a Minor to Apply for Appointment as a Guardian:** Where any person applier for the issue of a succession certificate on behalf of a minor, such person shall unless the aggregate amount or value of the debts or securities specified in the application does not exceed five hundred rupees or the Court otherwise orders, present an application under the Guardians and Wards Act praying for his appointment as guardian of the property of the minor. Unless the Court otherwise orders no succession certificate shall be granted to him unless he has been appointed as such guardian.

(P.Dis. Nos.577/44 and 144/47)

**14. Extension or amendment of certificate :** An application for the extension or amendment of a certificate shall be by interlocutory application, entitled in the original petition under which the certificate was granted; and shall be in Form No.II.

**15. Deposit in Court :** The Deposit required by Section 14 of the Successin Certificate Act, 1889 (Now Section 379 (1) of the Indian Succession Act, 1925) shall be made by payment of the amount into Court in manner prescribed by Rules 157 to 172 of Chapter IX, part I, (supra), and an application shall not be admitted by the Court, except upon production of the receipt mentioned in Rule 158.

**16. Procedure when application is granted :** If the application is allowed, the Court shall send to the local treasure officer, a cheque for the amount of the fee payable, together with a memorandum headed with the cause-title of the application, stating the name of the applicant, and requesting the said officer to issue Court-fee stamps for the said amount, engrossed in the name of the Court. The certificate shall be engrossed on the stamp paper so furnished and, after cancellation of the stamps, shall be delivered out to the grantee.

***Note:***- With reference to the High Court's Circular No.2322, dated 23rd August, 1894, which directs (1) that, whenever an application is made for probte or letters of administration under the Indian Succession Act X of 1865, or the Probate and Administration ACt, V of 1881, the District Judge (or District Delegate) shall, before he passes orders on the application, require the applicant deposit a sum of money equal to the amount of the Court-fee leviable on the estimated amount of the assets, as specified in the application and (2) that if the application be refused, the amount deposited shall be refunded to the applicant, the High Court has now ruled that an application is not to tbe deemed ot have been "refused" until it has been finally refused; that is until it has been finally refused; that is until the appeal time has expired, or, until the appeal, if there is one against the order of refusal, has been dismissed. The Circular of 1894 was repealed by the Civil Rules of Practice. But the direction to postpone the refund till the expiry of the appeal time or until the appeal, if there is one, shall have been dismissed, would still continue to be in force.

(H.C.Dis.864 of 1910)

**17. Payment of out of excess:** If the amount paid into Court exceeds the fee payable, the excess shall be paid out of Court to the applicant, in manner prescribed by Rules 157 to 172 of Chapter IX, Part I, (supra).

**18. Notice:** Unless the Court, for reasons to be recorded in writing, otherwise orders, notice of the application, in Form No.10, shall be published and served in manner prescribed by Rule 2(2) (supra).

**19. Bond and sureties :** (1) Where the Court orders a bond to be given, a bond shall be given to the Judge with one or more sureties, in Form No.12, and Rule 5 (supra) shall apply to the preparation and executin there of, and to the justification of the sureties.

(2) The account mentioned in the said form shall be in the form prescribed by Rule 8 (supra), and shall be verified by the affidavit of the grantee of the certificate.

## విల్లు వ్రాయు విధానం - సాక్షులు సంతకం చేయు విధానం

(i) It is no longer possible for any one who is not either a soldier-employed in an expedition or engaged in actual war fare or a mariner at sea to execute a will merely by word of mouth. A written instrument is made absolutely necessary.

(ii) The testator should sign or affix his mark to the will or it should be signed by some other person in his presence and by his direction. The signature or mark of the testator or the signature of the person signing for him should be so placed that it should appear that it was intended thereby to give effect to the writing as a will.

(iii) Atleast two persons should attest the will as witnesses. Each of them should have seen the testator sign or affix his mark to the will or some other person sign the will in the presence and by the direction of the testator; or if they did not see either of these, each of them should have received from the testator a personal acknowledgment of his signature or mark or the signature of such other person. It is not enough if the person who signed for the testator and under his direction says that the testator asked him to sign and that he did so.

(iv) Each of the attesting witnesses should sign the will in the presence of the testator. But it is necessary that an attesting witness should be present at the time when "not" another attesting witness signs it.

4. The Act comes into force on the 1st of Junuary; 1927. So any will made on or after that date should conform to these new provisions.

(Press Communique, October 16, 1926 at P.2145, Pt.I,F.S.G.G., dt. 26-10-1926.)

## II JURISDICTION OF SENIOR CIVIL JUDGES AND JUNIOR CIVIL JUDGES.

**(a) Certain Invested under Section 388 of the Indian Succession Act:** Under the provisions of sub section (1) of Section 26 of the Succession Certificate Act, 1989 (VII of 1889) (now Section 388 of the Indian Succession Act, 1925), and in supersession of Law (General) department Notification No.371, dated 5th June, 1924, published at Page 649 of Part I of the Fort St. George Gazette, dated the 10th June, 1924 the Local Government are pleased to invest all Courts of Junior civil Judges in the Presidency except those situated at headquarters of districts with the functions of a District Court under the said Act within the local limits of their respective jurisdiction.

[G.O.24, L. (G), dated 7-1-1925. H.C. Dis. 312 of 1925]

**(b) Senior Civil Judges appointed as District Delegates under Indian Succession Act:** Under the provisions of Section 265 of the Indian Succession Act, 1925 (Act XXXIX of 1925), and in supersession of High Cour's notification, dted 23rd July, 1927, the High Court hereby appoints all Civil Judges *ex-officio* as District Delegates under that Act within the local limits of their respective jurisdiction.

(H.C.P. Dis.947 of 1939)

**(c) Senior Civil Judges authorised to take cognizance of proceedings under Indian Succession Act:** Under the provisions of Section 29 (1) of the Madrs Civil Courts (Amendment) Act, 1926 (Act XIV of 1926), and in supersession of High Court's notification, dated 23rd July 1927, published at page 1138, part II of the Fort St. George Gazette, dted 23rd August, 1927, the High Court hereby authorises all Senior Civil Judge to take cognizance of any proceedings under the Indian Succession Act, 1925 (Act XXXIX of 1925). which cannot be disposed of by District Delegates.

(H.C.P. Dis.947 of 1939)

## కోర్టులో విల్లు భద్రపరచు విధానం

## III PRESERVATION AND INSPECTION OF WILLS-

In exercise of the powers conferred by Section 259 of Act X of 1865 (the Indian Succession Act) and Section 81 of ACt V of 1881 (the Probate and Administration Act) (now Section 294 of the Indian Succession Act, 1925), the Governor in Council has made and hereby notifies for general informtion the following regulations for the

preservation and inspection a wills filed in the Courts of District Judges of District Delegates.

(1) Every original will filed in the Court of a District judge for the purpose of an application for the grant of a probate or letters of administration with the will annexed shall, except as hereinafter provided, remain in the custody of the Chief Ministerial Officer of the Court in which it has been filed and shall be preserved by him in the manner hereinafter mentioned: Provided that it shall be lawful for a District Judge, upon a requisition from any Court for the production of an original will in a case pending in such Court, to forward the will in a sealed packet in the custody of a responsible officer to such Court for production in the pending case. The officer to whom an original will is so entrusted shall deliver the sealed packet containing the same to the presiding Judge of such Court, and the presiding Judge shall thereupon take all needful precautions for the safe custody and preservation of the will until he has returned the same in a sealed packet to the officer to whom it was entrusted for production, Who shall deliver the sealed packet to the District Judge in whose Court the will was filed for the purposes of the application for the grant of probate or letters of administration. A District Judge may transmit a will to a Court requiring its production, by registered post insured for not less than one thousand rupees, when its productin through a reqponsible officer before that Court will, in view of the distance to the Court, entail an amount of delay or expense which the District Judge considers unreasonable. No District Judge shall complywith any requisition for the production of a will except on reciept of a sum sufficient to cover all necessary expenses.

3) No original will, after being placed in the fire-proof box, shall be removed there from except under an order in Writing of the District Judge made for the purpose of.

a) complying with a requisition within the meaning of the proviso to Rule 1;

c) its being copied;

d) an inspection of such will;

e) its being transferred to the High Court to be kept in the Registry of the said High Court as hereinafter provided.

5) In the register mentioned in Rule 4 shall be entered the particulars indicted by the headings of columns.

An alphabetical index in duplicate in Form II to these Rules (*vide* Registers in Appendix III-F, Part II of Volume II) shall be prepared to

the entries in the register and a copy of such index shall be attached to each register.

A copy of each entry in the register and alphabetical index as soon as it is made shall be transmitted to the High Court for the purposes of Rule 14 *infra.*

7) The District Judge may upon an application in writing, for inspection of the register and or of any will mentioned in such register, make an order permitting the inspection of the same: Provided that no such order shall be made unless in such application are set forth the names, residences and occupations of the applicant and of the person or persons, if any, to be present on his behalf at the inspection, and the reasons for which an order of inspection is desired, and in the case of an application for the inspection of an original will unless the application be accompanied by a Court-fee stamp of Rs.2 under Rule 11(1) infra.

9) Every copy of an original will shall be made in the presence of the District judge of Chief Ministerial Officer of the Court as the District Judge may direct.

11)The following fees shall be levied by the District Judge in Court fee stamps:

i) For the inspection of an original will, a Court fee stamp of Rs. 2/-.

ii) For the inspection of a copy of a will made under Rule 2, a Court fee stamp of Rs.1.

iii) For copies, the same fee as for inspection of original wills in addition to copying charges at the usual rate obtaining in the Courts concerned.

14) The copies transmitted to the High Court under Rule 5 shall be entered in a register as far as possible in alphabetical order and the register shall be open to inspection under the conditions applicable to inspectin of registers under these Rules.

(H.C.Dis. 998 of 1905)

***N.B.* Wills are outside the scope of the Destruction of Records Act - v*ide* C.O.II (2) of Chapter XI at page 330 *infra***

## Notification

Published at page 613 of Part I of the Andhra Pradesh Gazette dated **6-3-1958.**

Under the provisions of Section 265 of the Indian Succession

Act 1925 (XXXIX of 1925) the HIgh Court hereby appoints all Senior Civil Judges in the territories specified in sub-section (1) of Section 3 of the States Reorganisation Act 1956 (Act XXXVII of 1956) Ex-Officio as District Delegates under the Indian Succession Act within the local limits of their respective jurisdiction. (Roc. No.306 of 1958 B1 dated 21-2-1958)

## సక్సెషన్ సర్టిఫికెట్ పిటీషన్‌లో చేర్చవలసిన అంశాలు

## PARTICULARS TO BE FURNISHED SUCCESSION CERTIFICATE O.P.

a) The date & time of the death of the deceases:

b) The ordinary residence of the deceased at the time of his death and, if such residence was not within the local limits of the jurisdition of the judge to whom the application is made, then the property of the deceased within those limits;

c) The family or other near relatives of the deceased and their respective residence;

d) The right in which the petitioner claims;

e) The absence of any impediment under section 370 of I.S.Act or under any other provision of this Act any other enactment, to the grant of the certificate of to the validity there of if it were granted; and.

f) The debts and securities in respect of which the certificate is applied for.